శ్రీ

# మహాపతివ్రతలకథలు



ఇయ్యది

బెజవాడ శ్రీ కన్యకాపరమేశ్వరీ హిందూ హైస్కూలు
ప్రథానాంధ్రోపాధ్యాయులును, విచిత్రాష్టావధాని,
విద్వత్కవి, నాటకచక్రవర్తి బిరుదాంకితులు నగు,
బ్రహ్మశ్రీ

## మల్లాది అచ్యుతరామశాస్త్రిగారిచే

రచియింపఁబడినది.



ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు,
సరస్వతీ బుక్ డిపో,
బెజవాడ. (కృష్ణాజిల్లా)

 1932. [వెల 0-12-0.

# సరస్వతీ బుక్కుడిపోవారి స్వంతప్రచురణములు.

## —* ఆంధ్ర నాటకములు. *—

| | | |
|---|---|---|
| రసపుత్రవిజయము ఇ॥ య॥ రు. | 1 | 0 |
| రాణాప్రతాప్ సింగు డిటో | 1 | 0 |
| సంపూర్ణభారతం బళ్ళారి పండిత. కే॥ సు॥ | 1 | 4 |
| సోమనాథ బ॥ కో॥ | 0 | 12 |
| శ్రీకృష్ణరాయబారము | 0 | 12 |
| సంపూర్ణరామాయణము | 1 | 0 |
| భీమప్రతిజ్ఞ క॥ కో॥ | 0 | 12 |
| మహానంద ద్రో॥ శ్రీ॥ | 1 | 0 |
| గర్వభంగము అ॥ సుం॥ | 0 | 12 |
| చండిక ము॥ వేం॥ | 1 | 0 |
| కుశలవ జ॥ ల॥ | 1 | 12 |
| సతీఅనసూయ సో॥ రా॥ | 1 | 0 |
| ప్రతాపరుద్రీయము | 1 | 4 |
| అలీబాబా 40 దొంగలు | 0 | 12 |
| తాజ్ మహాల్ (జహానారా) | 1 | 0 |
| ధరణికోట | 1 | 4 |
| పార్వతీగర్వభంగము గంగావతరణము | 1 | 0 |
| కాళిదాసు | 1 | 0 |
| సంగీతశశిరేఖ | 0 | 12 |
| భక్తకబీర్ కో॥ సు॥ | 1 | 0 |
| పాదుకాపట్టాభిషేకం | 0 | 12 |
| కాంతామతి బ॥ కో॥ | 0 | 12 |
| వృద్ధవివాహము గో॥ వేం॥ | 0 | 12 |
| రాధాకృష్ణలీల క॥ వేం॥ | 0 | 12 |
| కృష్ణలీల మ॥ అ॥ | 1 | 0 |
| సంగీత సావిత్రి మ॥ శ్రీ॥ | 0 | 12 |
| రామదాసు రా॥ నా॥ | 1 | 0 |
| పద్మవ్యూహము మ॥ న॥ | 1 | 0 |
| కనకతార ము॥ చం॥ | 0 | 12 |
| శ్రీమతీదేవి శ్రీ॥ త్రి॥ | 1 | 0 |

## —* నవలలు. *—

| | | |
|---|---|---|
| వనదుర్గము రు. | 1 | 0 |
| తపోవనము | 1 | 0 |
| చాందసుల్తానా | 0 | 12 |
| శిశుహత్య పా I | 1 | 0 |
| శిశుహత్య పా II | 1 | 0 |
| ఇందిర | 1 | 0 |
| ఘోరకలి | 1 | 0 |
| వాడేవీడు | 0 | 12 |
| హత్యావిచారము | 0 | 6 |
| గజదొంగ | 0 | 12 |

## —* స్త్రీల పాటలు. *—

| | | |
|---|---|---|
| ఘాలిసుబ్బారావుపాటలు | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 12 |
| వేడుక పెండ్లిపాటలు | 0 | 8 |
| మహిళామనోరంజనీ | 0 | 5 |
| అధ్యాత్మరామాయణం | 0 | 8 |

## —* వైద్యగ్రంధములు. *—

| | | |
|---|---|---|
| వస్తుగుణ ప్రదీపిక | 3 | 0 |
| గృహవైద్యచికిత్సారత్నము పా I | 1 | 0 |
| డిటో రెండవభాగము | 1 | 0 |
| వైద్యరహస్యదీపిక | 0 | 8 |
| సహదేవపశువైద్యము | 0 | 6 |
| శోఫరోగనివారిణి | 0 | 8 |

## —* ప్రబంధములు. *—

| | | |
|---|---|---|
| భాగవత రత్నములు | 1 | 0 |
| వేమన రత్నములు | 1 | 0 |
| సమయోచిత పద్యరత్నావళి | 0 | 6 |
| భగవద్గీత (పద్యకావ్యము) | 1 | 0 |
| దండకరత్నములు 20 దండకములు | 0 | 8 |
| కబీరుదాసు హరికథ బా॥ నా॥ | 1 | 0 |

వలయువారు:—సరస్వతి బుక్కుడిపో,

# మహాపతివ్రత కథలు.



ఇయ్యది

బెజవాడ శ్రీ కన్యకాపరమేశ్వరీ హిందూ హైస్కూలు

ప్రధానాంధ్రోపాధ్యాయులును, విచిత్రాష్టావధాని, విద్వత్కవి,

నాటకచక్రవర్తి బిరుదాంకితులు నగు,

బ్రహ్మశ్రీ

**మల్లాది అచ్యుతరామశాస్త్రిగారిచే**

రచియింపఁబడినది.



ప్రకటనకర్త:

**కురుకూరి సుబ్బారావు,**

సరస్వతీ బుక్ డిపో,

బెజవాడ. (కృష్ణాజిల్లా.)

మొదటి కూర్పు 1000 ప్రతులు.

తెనాలి భారతీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

**1932**



వెల 0—12—0.

# వి ష య సూ చి క.



# మహాపతివ్రత కథలు.

## సక్కుబాయి.

ఈమె కలికాలమునం దనపతివ్రత పరిపాలనా విశేషముచే పండరిపురాధినాథుండగు పాండురంగనియం బ్రత్యక్షమైన భక్తలోక శిరోరత్నము. మఱియుం దాను తరించుటేగాక, తన పెనిమిటిని, మామగారిని యత్తగారిని దరింపఁజేసి కీర్తిగాంచిన పరమధన్య; సుగుణముల పేటి; శుభలక్షణముల కాలవాలము; అందములకు పట్టుగొమ్మ; ఆచారములకు భవనము; అన్నదానమున కన్నపూర్ణ; చుట్టాల సురభి; చదువులకు సరస్వతి; పాతివ్రత్యమునకుం బార్వతి; పరమార్థ చింతనయందు లీల; భర్తృసేవాకార్యవ్రతమందు సుమతి; వ్రత నియమములందు సీమంతిని; ధైర్యమున సావిత్రి; పవిత్రతకు గంగా భవాని; లావణ్యమునకు సీత; విలాసములకు మందిరము; వేయేల సుగుణపుంజము; ఆమెకు సాటియగు పుణ్యవతి యిలాతలంబున మనుష్యాంగనలయందుం బుట్టినదా యని చూచువారు ముక్కుపై వ్రేలిడనివారుండరు. బ్రహ్మదేవునికి శిల్పనైపుణ్యదర్శ ప్రాయమైన కాంతారత్నము. ప్రాతఃకాల స్మరణీయులగు మహాపతివ్రతారత్న ములయందగ్రగణ్యురాలు. వేల్పువెలందులు సక్కుబాయి పేరు విన్నంతమాత్రమున, వినమ్రవదనలయి, యామెను మామటకు సర్వదా భూలోకనివాస మేర్పఱుపఁబూని విరించిని, నిందింపనివా రుండరు. భూలోక సతీరత్నములలో పేరుమోసిన, సక్కుచరిత్రము. సర్వపాపనీలకంధ, కింకరశృంఖలీభూత గారుడము సర్వవ్యాధినివారణము సమస్తమంగళాస్పదము. సర్వవాంఛా పరిపూర్ణ భాండాగారము. సర్వదా పఠనీయము. స్మరణీయము. ముయ్యేడుతరములవారిని తరిం పఁజేసిన గొప్ప యిల్లాలువృత్తాంతము. ఆర్యావర్తదేశమున కలంకారమగు సి ద్ధాంతరులం బేరుమోసిన పాతివ్రత్యమహిమచే పరమాత్మ వేదాంత

వేద్యుఁడు, మాయానాటక సూత్రధారి, పాండురంగనిచేత దనయింటఁ గోటరికము చేయించిన శీలవతి. యామెవృత్తాంతము వినినవారికి నశింపని పాపములుండవు. చంద్రభాగానదీతీరమున విరాజిల్లు పండరి పురమునకు సమీపమున నొక బ్రాహ్మణాగ్రహారము కలదు. అందు వేదాంగములు, శాస్త్రములు, మొదలగునవి చదువుకొని సర్వదా పీతిహాబాత్మ నారాధించు, యోగాభ్యాసాదులచేతను, మంత్రోపాస నాదులచేతను, తత్వవిచారములచేతను కాలముగడుపు భట్టుమిశ్రుఁ డను భూసురోత్తముఁడొకఁడు, అతఁడు స్వధర్మపరాయణుఁడై నిత్యము పంచయజ్ఞములు సలుపుచు, దేవతారాధన మొనరించుచు, అతిథి పూజల నాచరించుచు, సుగుణఖనియును, విద్యావంతుఁడును, మాతాపితృపూజాసమాసాదితాంతరంగుండును, అమాయకుండును నగు కుమారునితోడను, వినయవతియు, శీలవతియు, గుణవతియు, శ్వశ్రూసేవాపరాయత్తస్వాంతయు నగు సక్కు యను పేరుగల కోడలి తోడను, భర్తసేవాపరాయణురాలు, గృహకార్యనిర్వాహణ ధురీ ణయు, నపరిమిత ధనాశాపరురాలు, యించుక గయ్యాళితనము, మాట పట్టుదల మొదలగు కఠినస్వభావములు గల భార్యతో దన నేర్పుచేతను, సంసారవిరక్తియు మిక్కిలి కలిగియుండుటచేతను గృహ కృత్యపు వ్యాపారములన్నియు భార్యయధీన మొనర్చి తన నియమా దులయందు కాలము గడుపుచుండును. కుమారుఁడమాయకుఁడు. ఛాందసుఁడు. కాఁబట్టి తల్లిదండ్రుల మీఁద సర్వ వ్యాపారములు వదలి తిండివేళకు తల్లి వచ్చి, యెదుటఁ గూర్చుండినఁగాని కడుపార నన్నముతినుటకయిన నిష్టపడనివాడగుటచేఁ దల్లిమాట కడుగుదాఁటని కుమారుఁడు కూడ నింటివ్యాపారములు తల్లిమీఁదనే విడిచిపెట్టినాఁడు. కోడలు సక్కుబాయి యామె పుట్టినింటివారు పరమభాగవతోత్తములు. కావున నీమెకుఁగూడ చిన్నప్పటినుండి భజనలు, పాటలు, దానములు, వ్రతములు, స్నానములు, పూజలు, ధ్యానములు బాగుగ నలవాటుపడినవి. అత్తగారికి యింటికి నవసర మయిన బండచాకిరి మొదలగునవి చేయుటయందు శరీరదార్ఢ్యము తప్పిపోవుటచేతను, కోడలుండగా మనమేల చేయవలయునను యభి

మానము చేతను, భూములు వడ్డీవ్యాపారము మొదలగు లౌక్య వ్యవహారములు, తానే చూచుట యావశ్యకమగుటచేతను, యావత్తు యింటిపనిపాటలు సక్కుబాయి మీఁదనే వదలిపెట్టినది. లోభితనము కలదు. కావున తనకుఁగల లోభితన మాకోడలికిఁగూడ బాగుగా నేర్పవలయునని, దానాదులు వ్రతాదులు మాన్పుటయేగాక, ముష్టిఁగూడ వేయుట నిష్టములేక బిచ్చగాండ్రు వచ్చినట్లుగాఁ బంకమని కోడలికిఁ గట్టికట్టడి చేసినది. చిట్టిగింజలు ముష్టిపెట్టరాదు. సరిగదా పంచపాత్రలు మంచితీర్థమైన నితరులకీయరాదు. పూజ, వ్రతము, దానము పనికిరాదు. భజనసేయుట పనికిరాదు. రామ కృష్ణ యనుటయు బొత్తుగాగిట్టదు. అందుచే నత్తకు గోడలునకు పడుట లేదు. కోడలు అత్తగారిని దైవమువలె చూచును. ఆమెమాటకడుగుదాటని యిల్లాలు. అత్తగారో, కోడలుచేయు భజనపూజ మొదలగునవి గిట్టకపోవుటచేత, పిలిమీఁద నెలుక, యెలుకమీఁద పిల్లిని బెట్టి సక్కుబాయిని నిత్యము మోటదెబ్బలు కొట్టుచుండును అన్నపానాదులు వేళకు పెట్టుటలేదు సరిగదా పాండురంగనిమీఁద నొక్కపాటపాడుటకుఁగూడ నామెకు నధికారము లేదు. కోటరికము హెచ్చయినది. కాని సక్కుబాయికి మాత్రము భక్తి దిన దిన ప్రవర్ధమానమగుచున్నది. వెలుపల విగ్రహము మీఁదఁజేయు పూజ మనోపీఠమునసే పాండురంగని ప్రతిష్ఠించి మానసపూజ స్థిరముగా జేయసాగినది. ప్రహ్లాదునివలె శరీరము, భర్తకు, అత్తగారికి, స్వాధీనము చేసినది తల్లిమాటచే సక్కుబాయిని భర్తకూడ నప్పుడప్పుడు కొట్టుచుండును. యింటిలోఁ బ్రబలబధ మెక్కుడయిన కొలఁది భక్తికి స్థిరత్వ మేర్పడినది. సక్కుబాయి శరీరమున భక్తిరసము ప్రవహించుచున్నది రాత్రింబవళ్ళు క్షణకాలము వ్యవధిలేకుండ, పని చేసినను తరుగని చాకిరి, సక్కుబాయికిఁ గల్పించుచుండును. అత్తగారికి కోపమునకు ముఖ్యకారణమేమన, సక్కుబాయికిఁ గృష్ణపరమాత్మయందుగల భక్తియే యామె యత్తగారు చెప్పినపని చేయక విడువదు. మగనిమాట దిరస్కరించదు. మామగారిమాట కడుగుదాఁటదు. పాండురంగనియందు భక్తివిడువదు. ఆమె శరీర

రూపము తాగిగివేసి హృదయఫలకమునఁ బ్రతిష్ఠించు కొనినది. సత్యవంతుని నేత్రప్రాంతములు విహరించినది. సామ్రాజ్యలక్ష్మి నవీనావతారము దాలిచి, తనను ప్రేమించుట కరుదెంచినది యని, మనసున సిద్ధాంతము చేసికొనినాఁడు. హృదయసింహాసనమున నధిష్ఠింపఁజేసికొని యానందరసాభిషవనముచే సర్వాంగసహామండలమునకు మహారాణిగా పట్టాభిషేకము చేసికొని పర్ణశాల కభిముఖుఁడయినాఁడు మహాత్ముగా నెక్కడనుండియో లజ్జాయవనిక (తెర) యిరువురిమధ్యను ప్రవేశించినది. ఆ తెరచాటునఁ జిత్రాశ్వుఁడు నిష్క్రమించినాఁడు. కొంతసేపటికి సావిత్రి మనోరంగమున క్రమక్రమముగా నా తెర పైకి లేచిపోయినది. సత్యవంతుని రూపము పటముపై లిఖయించినది. దాసీముఖంబున తండ్రి కెఱుఁగఁజేసినది అశ్వపతి యారూపమున కచ్చెరువంది, పుత్రికాభిప్రాయము గుర్తెరిగి యుబ్బిపోయినాఁడు. కులశీలాదులు రూపముచేతనే గ్రహియించినాఁడు. వేసము మాత్రము దరిద్రమును సూచించుచున్నది. దంపతుల కనుసంధాన క్రమమును మానసమున యోచించుట ప్రారంభించినాఁడు. కార్యసాధన రూపు దాల్చి ప్రత్యక్షమయినట్లు నారదుఁడు మార్గవశమున, నశ్వపతిని సమీపించినాఁడు.

అశ్వపతియు నారదుని యథాశాస్త్రీయముగాఁ బూజించి సుఖాసనాసీనునిఁగాఁ జేసినాఁడు. సావిత్రి వినయముతో నమస్కరించినది. నారదుఁ డాకుమారిని దీవించి, రాజా! పుత్రికాపరిణయమహోత్సవము చూచెడుకాలము సమకూరనున్నది. ఆడుపిల్లలఁ గన్నవారికిఁ దగిన యల్లుఁడు దొరుకునంతకు మనసున కూరట కలుగదు సుమా, యని ప్రసంగించుచుండ నారూపపటమును పరికింపుడని భూకాంతుఁడు నారదున కొసంగె. దేవమౌని, చిత్రఫలకము నీక్షించి, యీతఁడు సాళ్వదేశాధిపుడగు ద్యుమత్సేన పుత్రుఁడు. విద్యావంతుడు. శీలవంతుఁడు. పరాక్రమవంతుడు. పేరిట సత్యవంతుడను ప్రఖ్యాతి గన్నవాఁడు. జన్మనామము చిత్రాశ్వుఁడు. ప్రకృతము బీదరిక మనుభవించుచున్నాడు. శత్రువులచే రాజ్యభ్రష్టుఁడై ద్యుమత్సేనుఁడు భార్యాసమేతుఁడై యీ యడవియందున్నవాఁడు. అంధు

లగు మాతాపితలకు పరిచర్య లొనర్చుచు శత్రువిజయోపాయముల నారయుచున్నవాఁడు. అమ్మా! సావిత్రి నీవును బుద్ధిమంతురాలవు. వయోవతివి. తగిన వరుని కోరుకున్నావు. మంచిదే కాని సమస్త సౌఖ్యములకు ప్రధాననిదానమగు ద్రవ్యము పూజ్యము. మహారాజ పుత్రివి. సకలసౌఖ్యముల ననుభవించుచు బంగరు తూగుటుయ్యాల సుఖపడు నీవీ నిష్పచ్చరపు రాకుమారునితో నట్టి సౌఖ్యము లనుభ వింపజాలుదువు. వయోరూపములు నీమనసు నాకర్షించి యుండవచ్చు. వివాహసంబంధము జీవితాంతమేగాదు పరలోకమునఁగూడ విడువదు. అందున నీవు శీలవతివి, కావున నీసంబంధముపై యపేక్షవీడి యింకొకని వరింపుము. యోచింపుకొనుమని నారదుఁడు వచించెను. అశ్వపతి అమ్మాయి! యెన్నికష్టములనయిన బడవచ్చునుగాని, దరిద్ర మనుభవించుట ప్రయాసము. నీవు సుకుమారివి. నీవాకష్టముల భరింపఁజాలవు. నిన్నుఁజూచి మేము సర్వదా కంటఁదడిపెట్టుచుండవలయు. మించిపోయినదిలేదు. వివాహోచిత వయస్కులగు రాకుమారుల పటములు వేనవేలు దెప్పించెద. మఱియొకని నీయిష్టము వచ్చిన వానిని వరింపుము. అని నిష్కర్షగా వచియించెను. సావిత్రి ముని చంద్రమా! మీరు నా సౌఖ్యమును విచారించి వచియించినారు. నా నిశ్చయాభిప్రాయమిది. సత్యవంతుని భోగభాగ్యములఁజూచి వరింప లేదు. వయోరూపములఁగాంచి యుత్సాహపడలేదు. మాతాపితృ భక్తియు, పౌరుషసంపత్తియు, సుగుణసంపత్తియు, విచారించి మన సార వరించితిని. భోగభాగ్యములు శాశ్వతములుగావు. సంపదలు పరాక్రమవంతు నాశ్రయింపక యన్యుని వరించునా? క్షత్రియునకు గావలసిన శుభలక్షణములన్నియు వానియందు గలవు. అదియుగాక పెనిమిటితో పేదరికము, వానతో సీగి యుండదను లోకోక్తి మీ రెఱుంగరా? మనోనుకూలుఁడగు మగనిచెంత, వనమున నివసించి కందమూలాదుల భుజించినను చాలు. దివ్యసౌధముల శాల్యోద నాదు లనుభవించుటకంటె వేయిమడుగులు సౌఖ్యములనిచ్చి సార వంతములగును. దారిద్ర్య మొక్కటియేగదా సత్యవంతునియందు లోపము. అది దైవికము. నా వివాహానంతర మాదరిద్రదేవత వరిం

భ్రాంతి వదలినది. భక్తిరసప్రవాహములో మునిగినది. పాండురంగని పాదారవిందములు డెందమున నమ్ముకొన్నది, “నమ్మి చెడినవారు లేరు. నమ్మక చెడిపోయిన వారుందురు.” యని పెద్దలు చెప్పినపలుకులు నిక్కముగా దలంచి సర్వదా యీశ్వరారాధన సల్పుచుండును. ఇట్లుండ నొక్కనాడు బియ్యపుబుట్ట నొక్కదానినిం జూపి పిండి విసురుమని యత్తగారు చెప్పినది. విశీధిదాకీ విసిరినది. చేతులు బొబ్బలు పొక్కి చిట్లినవి. పుండ్లుపడినవి, లోతు బావులనుండి గిలకలమీద నీళ్ళు తోడవలె, ధాన్యము దంపవలెను, గోడ లలుకవలెను, అత్తమామల కాళ్ళు పిసుకవలెను, ఆహారము తిన్నగా లేకపోవుటచేత కన్నులు, తలయు తిరుగసాగినది. పిండి విసరకపోయిన, యత్తగారు చీపురుదీసి కొని సిద్ధముగానుండును. అమ్మా! నీకీ కష్టమువచ్చినదా, యని యాదరించువారు లేరు. దిక్కులేనివారికి దేవుడేదిక్కుగదా యని, నిశ్చయించి స్వామీ! యీకోటరికము నాకు జన్మాంతము తప్పదు. నిక్కముగ నేను నీ భక్తురాలను కానా, నా ప్రారబ్ధమింతటితో సరిపోయి నదా, నీపాద పద్మారాధనకు స్వేచ్ఛనివ్వవా, యని మొరలిడి శోషవచ్చి మూర్ఛిల్లినది. దయాసింధుడు, పాండురంగడు సక్కుబాయి మొరవిన్నాడు. సక్కుబాయికి నత్తగారివలన గలుగుచున్న బాధలు కనుగొన్నాడు. ఆ రక్షణ బిరుదమ్ము స్మరణకు దెచ్చుకొని, యొక శక్తిని ప్రయోగించినాడు. ఆమె సక్కుబాయివలె వచ్చినది. బియ్యపుబుట్ట యంతయు విసరినది. మాయమయినది. సక్కుబాయికి కొంచెము ప్రబోధము కలిగినది. అత్తగా రేమనునో యని భయపడుచు వెంటనే లేచి బియ్యము విసరంబోయినది బియ్యము లేవు. దిగులుపడినది. యత్తగారి పాదసేవకు బోయినది. పిండివిసరితివా యని ధిక్కరించినది. సక్కుబాయి యేమియు చెప్పజాలక నిలువం బడినది. పరుగుపరుగునవచ్చి యత్తగారు, తిరగలివద్ద బియ్యపుబుట్ట లేకపోవుటం జూచి, సక్కుబాయిని చావంగొట్టినది. నీపుట్టింటికి జేరవేసినావని దలంచినది. పిండిబానవద్దకు బోయినది. పిండికొలిచి మూతవేట్టుచున్న సక్కుబాయిని చూచినది. విభ్రాంతపడినది, సక్కూ యని పిలిచినది. నిజముగు సక్కుబాయినిం జూచినది. నాతో వేళా

కోళమా, పిండివిసరి విసరలేదనెదవా యని, తిరుగ బారినది. పిండి కొలువ ప్రారంభించినది సరిపోయినది. యేమియుతోచలేదు. కొలంది కాలములో నింతపిండి యెట్లు విసరగలిగినదా యని యచ్చెరువు పడినది. తిరిగియొక బస్తాబియ్యము పోసినది శీఘ్రముగా విసురుచున్నది. సక్కుబాయి యత్తగారి పాదములమీదం బడినది. చేతుల బొబ్బలు చూపినది. విసరలేనని దీనముగా బలికినది. ఎంత వేడినను ప్రయోజనము లేదు. విసరకతప్పదని చెప్పి వెళ్లినది. యింతలో భర్తవచ్చి పాదములొత్తమని పిలిచినాండు సక్కుబాయి యడకత్తులోని పోకవలె నలుగుచుపడినది. పాండురంగని స్మరియించుకొని, పెనిమిటి చెంతకేగినది. కృష్ణుండు స్వయముగా బయలుదేరినాండు. సక్కుబాయి యవతారము దాల్చినాడు. తిరుగలిముందు కూర్చున్నాండు పిండి విసురుచున్నాండు. కొలంది కాలములో బియ్యమయిపోయినవి. సక్కుబాయియయిన కృష్ణుండు, అత్తగారి సమీపమున కేగినాడు. పాదము లొత్తుచున్నాండు. వేకువజామయినది. నిజముగు సక్కుబాయి తిరుగలివద్దకుం వచ్చినది. పిండిగాంచి చూచినది. తెల్లంబోయినది. తనయొద్దనున్న కృష్ణవిగ్రహము చూచుకొన్నది. తండ్రీ! నాకొఱకు పిండి విసరిపోయినావా. లేకుంచో నేను పెనిమిటి పాదసేవకుం బోయి ఘటియయైనను కాలేదే, యీబియ్యపుకుప్ప మనజమాత్రులు విసరగలరా. దయామయా, నీ దర్శనము లభించు ప్రాప్తిలేదా, అంత పాపురాలినా? పిండివిసరుట యెక్కడ నేర్చుకొన్నావయ్యా, ఏవీ. నీచేతులేవి, బొబ్బలుపొక్కినవా, యమరపూవులవంటి నీచిన్ని చేతులతో నీ యినుపపిడి పట్టుకొనంగలిగితివా. చాల యలసినావు తండ్రీ! నాయొడిలోం బండుకొనుము. నిద్రపొమ్ము. లాలిపాటపాడనా యని కృష్ణుని యొడిలో పెట్టుకొని జోకొట్టుచు లాలిపాటలు, తరంగములు ప్రారంభించినది భక్తిరసప్రవాహమున మునిగిపోయినది మైమరచినది. తాండవము సేయుచున్నది. యీ గానము చెవ్వుల సోకినది. కృష్ణుండు పసిపిల్లవానివలె సక్కుబాయిముందు గంతులు వేయసాగినాండు. ఆభక్తురాలు నిమీలితనేత్రయై పాండురంగని

ధ్యానము చేయుచున్నది. తనలోఁ తాను నవ్వుకొనుచు కనుల వెంబడి యానందాశ్రువులు గురియుచు పాండురంగఁడు తనతో మాట్లాడి నట్లుగా దలచుచు, మహానందముతో భజన సేయుచున్నది. అత్త గారికి మెలకువ వచ్చినది కోడలు చెప్పకుండా వెళ్ళినదనే కోపముతో వచ్చినది. భక్తిపరవశురాలగు కోడలినిఁ జూచినది. నీవు సానివా, సంసారివా? యీ సంగీతము లేమిటి? యీ గంతు లేమిటి? యని గద్దించి, చీపురుతో నాలుగు బాది, యీ కృష్ణవిగ్రహమును లాగి పారవైచి కాలు చేతులు కట్టి వాతలు పెట్టినది. యింతలోఁ కృష్ణుని వెదకుచు రాధారమణీమణి భట్టమిశ్రునింటికి వచ్చి కృష్ణుఁడు ప్రదర్శించుచున్న నాటకమును పరికించినది. క్రూర కార్యము సేయు ముసలమ్మను నాలుగు చాటుగా బాదినది. సక్కుబాయికి పరిచారము సల్పఁబోయినది. కృష్ణుఁడు సక్కును సమీపించినాఁడు. ఆపాదమస్తకము హస్తముతో నిమిరినాఁడు. వజ్రశరీరమయినది జవసత్వములు, పెచ్చుపెరిగినవి. రాధామాయి పాండురంగనిఁ దీసికొనిపోవుటకుఁ ప్రయత్నించినది. గాని, కృష్ణపరమాత్మ మాత్రము సక్కుబాయి కోటరికము పూర్తియగు దనుక భక్తురాలి మందిరము విడువదలంచ లేదు. భట్టమిశ్రుని భార్య కోడలిని పెట్టు కష్టములు లోకవిదితము లయినవి సక్కుబాయి మహాభక్తురాలని భక్తకోటికిఁ దెలిసినది. ఆ పతివ్రతాశిరోమణిని సందర్శించుటకు, భక్తబృందములు గుంపులు గుంపులుగా వచ్చుచున్నారు. గాని, గ్రుక్కెడు మంచితీర్థమయిన నా భక్తలోకమున కర్పించుటకు సక్కుబాయి యస్వతంత్రురాలు గావున మనసు పరితాపపడుచు పరమభాగవతోత్తములకుఁ గనులతో నమస్కరించుచు, తన పేదస్థితికి దుఃఖించుచుఁ గాలము గడుపుచుండెను. పాండురంగఁడాయిల్లాలికిఁ గొంగుబంగారముగ నెంటనంటి కంటికి రెప్పవలెఁ గాపాడుచున్నాఁడు. ఇట్లుండ పండరీపురమున పాండురంగని యుత్సవములు ప్రారంభమయినవి. దేశదేశములనుండి భాగవత శిఖామణులు తీర్థయాత్రకరుగుచున్నారు. కొంచెము చుట్టయినను సక్కుబాయిని సందర్శించుటకుఁ బ్రజలు గుంపులుగా వచ్చి యామె యింటిముందర నుండి వెళ్ళుచున్నారు. సక్కుబాయి కృష్ణవిగ్రహము.

అత్తగారు తీసికొనిన నాటినుండి స్వామికి నివేదన లేదని తాను భోజనము మానినది. నిత్యము అత్తగారిని బ్రతిమాలుచున్నది గాని యామెకు దయరాలేదు. తన కట్టి కష్టములు కలిగినవని భగవంతునితోఁ జెప్పుకొనవలసినదేగాని, తన పెనిమిటితోగాని, మామగారితోగాని, యిరుగుపొరుగు వారితోగాని, యణుమాత్రము వెలిబుచ్చదు. యొక్క దినమున మిగుల వినయముతో, విగ్రహముసంగవలయుననియు, భక్తకోటితోను, భర్తతోఁగలసి పండరికేగెదననియు నత్తగారిని ప్రార్థించినది. యామె హృదయము శిలామయము దయారసము పుట్టలేదు సరిగదా కోపమెక్కుడయ్యె. నీవు యే యర్ధరాత్రి పారిపోవుదువో నిన్ను నమ్మరాదని, యింటిపనులు కాగానే యొక యింటిలో స్తంభమునకుఁ గట్టిపెట్టుచుండును. పెనిమిటితో మాటలాడనియ్యదు. తనకుమారునితోఁ గోడలికి జబ్బు. దాని మొగము నీవు చూడఁగూడదు. నీవు చిన్నవాఁడవు దానిసంగతి తరువాతఁ జెప్పెదనని, యమాయకుని కొడుకుతో మాయమాటలు చెప్పి కాలము గడపుచున్నది. అన్నపానాదులు లేక శుష్కించిన కోడలు సక్కుబాయి మానము పాండురంగనియందు పాదుకొని పోయినది. ప్రపంచము మరచిపోయినది గాని పెనిమిటి పాదదర్శనము సేయలేకపోయితిగదాయని విచారపడుచుండెను పాండురంగఁడు సక్కుబాయి వేషముతో సక్కు పెనిమిటిని, సక్కు అత్తగారిని సంతోషపెట్టుచున్నాడు. స్తంభమునఁ గట్టి పీడింప సక్కుబాయి భర్త బృందముతోఁ గలిసి, పండరీపురము చేరకపోయితిగదాయని మితిలేని, విచారమందుచు నిల్లు తలపోయఁజొచ్చె. ఓ చంద్రభాగానదీ. నీ నీరమునందు మునుగు ప్రాప్తము నాకుఁ గలుగునా? ఓ పాండురంగా! నీకోవెలఁ జూచు ప్రాప్తి నాకీ జన్మమునందు లభించునా? ఓరుకుమా మాయీ, నీ పాదసేవకీ పాపురా లర్హురాలుగాదని దోచెనా? ఓ దాసవరులారా! యీ పేదరాలు మీరు సలుపు పాండురంగని గుణానుభవము వీనులారా విను నోమునోచుకొనలేదా? ఓ కృష్ణపరమాత్మా! మాయత్తగారి హృదయములోఁ జేరి నన్ను పండరికిఁ బంపించు బుద్ధి పుట్టింపలేవా! పండరినాథా! నిన్నెన్ని బాధలు పెట్టి

నను సహింతునుగాని, నిన్నుఁ జూడనిది జీవింపఁజాలను. నీ వెందరినో భక్తులను కాపాడినావట. యథార్థమా! ఔనా! ఆ పాండురంగడవు నీవుకావా! యిటికరాతిపై నిలిచిన భద్రమూర్తివి నీవేనా! నీపేరింటి దేవుఁడు మఱియొకఁడా అని మొరలిడి శోషిల్లినది. రంగఁడు దయాంతరంగు డయినాఁడు. సక్కుబాయి పెనిమిటి వేషము వేసికొనినాఁడు. సక్కుబాయివద్దకు వెళ్ళినాఁడు. ఆమెకట్లు విప్పినాఁడు. నీవుపండరికివెళ్ళుము, మాయమ్మకు నేను సమాధానము చెప్పుకొనెదను. తిరునాళ్ళకాగానే బయలుదేరిరమ్మని చెప్పి యిరుగుపొరుగువారిని జతచేసి పండరికిఁ బంపినాఁడు. తానుసక్కుబాయియయి, స్తంభమునఁ గట్టుపడి నిలువఁబడినాఁడు. భగవచ్చరిత్ర మెవ్వరెరుంగుదురు. కనుగిరిపినంతలో బ్రహ్మాండములు కోటానుకోటులు మారిపోవుచుండును. సక్కుబాయిమీఁద ననురాగము, ప్రేమయు నానాటికి నభివృద్ధియగుటచే నొకనాఁడామె పెనిమిటి తల్లికి దెలియకుండ సక్కుబాయిని కట్లువిప్పి యింటి గదిలోనికిఁ దీసికొనిపోయినాఁడు. సర్వాభరణములు నొసఁగినాఁడు. మాయా సక్కుబాయితో సర్వవిధముల సౌఖ్యమనుభవించుచున్నాడు. యొకనాఁడు తల్లిచూచినాఁడు భయపడినాఁడు. అత్తగారినిచూచి మాయాసక్కుబాయి సిగ్గుపడినది. గృహకృత్యముల చక్కఁగా నెరవేర్చుచుండుటచేతను పాండురంగని మాయాజాలములోఁ జిక్కుటచేతను, భగవానుని సహవాసము సర్వదా కలుగుచుండుటచేతను, ఆమె హృదయకాఠిన్యము నానాటికిఁ దగ్గసాగినది. అంతట సక్కుబాయి భగవంతునిచే పండరికి పంపబడి భక్తబృందముతో గలిసి నామకీర్తన సేయుచు నాహారాదుల మఱచి కతిపయ పయనంబుల, పండరీపురము చేరి, చంద్రభాగలో జలకమాడి, రుకమాబాయిని సేవించి, విఠలుని పాదసందర్శనము చేసి, భగవన్నామము చేయుచు చిరకాలమునుండి యుపవాసదీక్షయం దుండుటచేత నాయిల్లాలు పాండురంగనియందైక్యమయినది. భక్తకోటులెల్లరు విచారసాగరమందు మునిగినారు. పసుపు కుంకుమచేతను పుష్పమాలికలచేతను సక్కుబాయి శవము నలంకరించినారు కర్పూర హారతులిచ్చుచు, భజనలుసేయుచు, పూజలుసలుపుచు దహనాదిక్రియలకై

చంద్రభాగానదీసమీపమున స్మశానవాటికకుఁ జేర్చినారు. పెద్దలందరు చేరి యామె మంగళసూత్రము, పసుపుచీరయు పదిలపరచి భట్టుమిశ్రునింటికిఁ బంపినారు. మంచిగంధపు తరువులు, కర్పూరపు బిళ్ళలు, మితిలేనివి చేర్చి రాసిపోసి చితి పేర్చినారు సక్కుబాయి శవమందుంచినారు. నేతిసిద్దెలు క్రుమ్మరించినారు. పాండురంగని స్మరియించుచు చిచ్చుదంగొలిపినారు. అగ్నిభట్టారకుఁడా భక్తురాలిశరీరము స్పృశించఁగలుగు భాగ్యము నేఁటికి చేకూరినదని సంతోషముతో గంతులువేయుచున్నాఁడా యనునట్లు మంటలుచే సక్కుబాయి శరీర మాక్రమించినాఁడు. భక్తులందఱు తదేకనిష్ఠతో భజన సేయుచున్నారు. లోకమంతయు నొక క్రొత్తమెఱుగు చెందినది. మాయా సక్కుబాయి యీ విచిత్రమును తెలిసికొన్నది. నిజముగు సక్కుబాయి శరీరము పోయినచో తన యవతారము శాశ్వతముగా భట్టమిశ్రునింట కోటరికముతోఁ దెల్లవారవలయు ననుకొనుచున్నాఁడు. రాధామహాదేవి యీ వార్త రుకుమామాయికిఁ దెలిపినది. రుక్మిణి, కృష్ణుఁడు సక్కుబాయి వేషములోఁ జిక్కుపడినాఁడు ముందుగతి యేమియని యోచించినది. నిజముగు సక్కుబాయిని బ్రతికించనిచో కృష్ణపరమాత్మ స్వస్వరూపమును ధరించ లేఁడని, నిశ్చయించి శీఘ్రముగా గరుత్మంతుని తలచినది. స్వర్గమునుండి యమృతము దెచ్చి సక్కుబాయిపయి వర్షించి, బ్రతికింపుమని యాజ్ఞనిచ్చినది. దేవేంద్రుని స్మరించి కుంభవృష్టిని వర్షించి సక్కుబాయి చితి చల్లార్పుమనినది. తెప్పపాటుకాలములో చేటంత మబ్బు పట్టినది. యురుములు మబ్బులు లేకయే కడవలతో వర్షము క్రుమ్మరించినది. సక్కుచితి చల్లారినది. వైనతేయుఁడా కుంభవృష్టిలో నామెపై నమృతము కురిపించినాఁడు. పుష్పశయ్యనుండి నిద్రలేచి వచ్చినట్లు సక్కుబాయి చితినుండి లేచి వచ్చినది. భక్తలోకమునకు నమస్కరించినది. యీ నాటక మామె కర్థముకాలేదు. చూడవచ్చినవారందఱు సంతోషవారధిలో నీదులాడినారు. పాండురంగని మహిమను కొనియాడినారు. గంతులు వైచుచున్నారు. వేల్పులు విరులసోనలు గురిసినారు. భక్తులందఱు సక్కుబాయితో పాండురంగని కోవెలకేగినారు. పాండురంగ విఠలుని

సేవించుచున్నారు. మాయాసక్కుబాయి యత్తగారికి నప్పుడప్పుడు భక్తిని బోధించుట ప్రారంభించినది. చిల్లగింజగంధముతాకిన నీటి బురద విరుగదా! అటులనే కృష్ణసహవాసముచే, నామె మనసు దినదినము పరిశుద్ధి వహించుచున్నది. పండరీపురికి ప్రయాణము సేయుచున్నది. పండరినుంచి సక్కుబాయి మంగళసూత్రముఁ పసుపు చీరయుఁ దీసికొని వచ్చిన బ్రాహ్మణుఁడు భట్టమిశ్రునింటికి చేరినాఁడు. యోగక్షేమములారసి, పండరిలో సక్కుబాయి మరణించిన వర్తమానము, నిమ్మళముగాఁ జెప్పినాఁడు. భట్టమిశ్రుఁడు పిడుగుమోఁదినట్లయినాఁడు. కొంతసేపటికి కుమారుని భార్యను పిలిచినాడు. యీవృత్తాంతము చెప్పఁగా మనకోడలు మనయింటిలో నున్నదని యత్తగారు పిలిచినది పలుకలేదు. అందఱు లోపలఁ బ్రవేశించినారు. ఎవ్వరు కనుపించలేదు. మురళీనాదము వీనులవిందుగా వినవచ్చుచున్నది. వనమాలికాగంధము కొలకొల పిసాళించుచున్నది. సక్కుబాయి నగలు, ధరించిన చీరయు చిలుకకొయ్యమీద నున్నవి. యీ బ్రాహ్మణుఁడు తెచ్చిన మంగళసూత్రము పసుపు చీరయు సక్కుబాయివే. అనుమానములేదు. దురూహ్యము, "మమ మాయాదురత్యయం" యను గీతావాక్యము భట్టమిశ్రునకు జ్ఞాపకము వచ్చినది. మాయాసక్కుబాయి కృష్ణభగవానుఁడని నిశ్చయించినారు. భగవంతునిచే సేవచేయించుకొన్న మహాపాపమునకు నిష్కృతికలదాయని యొకరు, భగవంతుఁడు మీపుణ్యవశమున మీకు దర్శనమిచ్చినాడని మఱియొకరు. ఇది యంతయు భక్తురాలగు సక్కుబాయి మహిమయే యని, యింకొకరు, పాండురంగని లీలావిలాసముల పూర్వములు అమూల్యములని మఱికొందఱు, తలకొకమాట చెప్ప మొదలిడినారు. అందఱు కలిసి యింటి యదార్థము తెలిసికొనుటకు పండరికి నాబాలగోపాలము బయలుదేరి వెళ్ళినారు. మురళీనాదము వీనులలో వినబడుచునేయున్నది. ప్రపంచమంతయు సక్కుబాయి రూపముగా నగ్రహారికుల కగుపడుచున్నది. సక్కుబాయి నామము భగవన్నామముగా లోకమంతయు స్మరించుచున్నారు. సక్కుబాయి కుటుంబము భక్తిరసార్ణవములోమునిగిపోయినది. ఎట్టకేలకుపండరీపురము చేరినారు.

పాండురంగని కోవిల భక్తబృందముతో నిండిపోయినది. పండరీపుర వాసులందరు చచ్చిబ్రతికిన సక్కుబాయిని సందర్శించుటకు విరగబడి వచ్చినారు. పసుపు కుంకుమ పూలమాలికలు తట్టలకొలది సక్కుబాయిమీదఁ గ్రుమ్మరించుచున్నారు. కర్పూర హారతు లిచ్చుచున్నారు. సాష్టాంగనమస్కారము లాచరించుచున్నారు. భట్టమిశ్రుని కుటుంబము స్వామి కోవిలలోని కేగినది. సక్కుబాయి వైభవము కనులారఁ జూచినారు. భక్తాగ్రగణ్యులందరు, భట్టమిశ్రుని భార్యను, కుమారుని, చూచినారు. కరతాళధ్వనులు చెలరేగినవి. మీరదృష్టవంతులు. చితిలోనుండి మీకోడలు బ్రతికివచ్చినది. ఎంతటిపుణ్యాత్ములయ్యా మీరలని స్తోత్రములు గావించినారు. అయ్యా! యీవిచిత్రము భగవంతునికిఁ దెలియవలయు. మాకోడలు మాయింట మాకు పని పాటలు చేయుచున్నది. మీరందఱు చచ్చి బ్రతికినదనుచున్నారు. ఇందలి నిజానిజములు నిర్ధారింపఁదగినవారు భక్తబృందము. పాండురంగఁడు. లేదా ఆతఁడే. మేము సామాన్యులము. నీయింటనున్న సక్కుబాయి పాండురంగఁడు. మీయదృష్టము పండినది. భగవంతుని దర్శనము చేసికొనిన మహాధన్యులు మీరని యత్తమామలకు నమస్కరించినది. నాథా శ్రీకృష్ణపరమాత్మను భార్యగా నేలిన భాగ్యశాలివి. యని పెనిమిటికి నమస్కరించినది. మావంశము తరింపజేసిన మహాయిల్లాలవు, తెలియక నిన్ను బాధలుపెట్టిన పాపురాలను, రక్షింపుమని యత్తగారు కోడలికినమస్కరించినది. ముయ్యేడు వంశములఁ దరింపఁ జేసినభక్తశిఖామణివి, సుగుణమణివని చేతులుపట్టుకొనిమామగారు బ్రతిమాలినారు. సక్కుబాయి మానసమునుండి బంధుప్రేమ లేచిపోయినది. భక్తిరసాయనము సేవించినది. దివ్యశరీర మయినది. పాండురంగని గుణానుభవము చేసినది, రాధాకృష్ణులు, రుకుమాబాయి, వైనతేయుఁడు జయవిజయులు, నారదాది దేవమునులు, ప్రహ్లాదాది మహాభక్తశిఖామణులు విమానములమీఁద మింట నిలువఁబడినారు. సక్కుబాయి భక్తిరసప్రవాహములో మునిగినారు. మైమరచినారు. చిత్రప్రతిమ లయినారు. రాధాసహితుఁడు పాండురంగఁడు సక్కుబాయిని సమీపించినాఁడు. కౌగలించుకొనినాఁడు.

భక్తబృందము జయజయ శబ్దములు ప్రయోగించుచున్నది. పాండు రంగని దేహమందు సక్కుబాయి కర్పూరదీపమువలె నంతరించినది. సాయుజ్యముక్తి కలిగినది, పాండురంగడు సర్వప్రపంచము తనయందు సముద్రమందు నదులు నామరూప శూన్యములయి లీనమయినట్లు లీనమగునని బోధించి, భట్టమిశ్రునితో నీ తపస్సు ఫలియించి యిటువంటి కోడలు దొరికినది. యామె నాయందైక్యమయినది. ఇంక కొంత కాలము మీ రిహలోకసౌఖ్యము లనుభవింపవలయును. నా భక్తురాలు సక్కుబాయివలన మీరుగూడ క్రమముగాఁ బరమపద మొసంగెదనని చెప్పి యంతర్ధానమందెను. భక్తబృంద మీ మహా వైభవముగాంచి తరించినది. భట్టమిశ్రుడు కుమారుడు భగవద్దర్శనమున కానందించుచు పెన్నిధి గోలుపోయిన పేదలవలె, నింటికిఁజేరి భక్తిపరవశులై కాలము గడుపుచు కాలాంతరమునందు పరమపదము చేరిరి. ఒక్క భక్తశిఖామణి జన్మించినచో దేశము వంశము తరించి, యాచంద్రార్క కీర్తివహించి సుఖంబుగా దేశంబు వర్ధిల్లుచుండును.



## సీతాదేవి.

ఆర్యావర్తభూమికి హారమణియగు విదేహదేశమందు మిధిల యను పుటభేదనం బొండుకలదు. అందలి మేడలయందు తెలిగంటి పాటలాధర లాటలాడుకొనుచు, చంద్రబింబమును ముద్దుచేత, వారి మోములయందలి, జాడుచుక్క యంటుకొనఁగలిగిన కళంకమునుజల నిధి పంకమని, మహిచాయయని, పుట్టుమచ్చయని, లేడిపిల్లయని, ముసలమ్మ, మఱ్ఱిచెట్టని, నూలువడుకు రాటమని. మహాకవులు చిత్ర చిత్రముగా చందమామను వర్ణించుచున్నారు. చాతుర్వర్ణ్యముల వారు, యథాశాస్త్రీయ ధర్మాచరణ పరాయణులై, మోక్షలక్ష్మీ కటాక్షవీక్షణామృత పాత్రులై మెలంగుచున్నారు. రాజయోగానుభవ ప్రదర్శనా దర్శనపాత్రయుఁడైన జనకుఁడు యాజ్ఞవల్క్య శిష్యుఁడై ఆత్మబోధామృత పానమత్తుండై విదేహదేశమందు ధర్మబీజముల, విధి

విగా నాటుచు ఫలపాక పర్యంత మా ధర్మ మహీరుహములఁ గాపా డుచు, రాజ్యపరిపాలన మాచరించుచుండె. అట్టితఱి నొకనాఁడు సవన మొండు సేయఁదలంచి, యా జనకభూపాలుఁడు, యాగభూమిని దున్నుచుండ నాగలికొన హలాగ్రమునకొక బంగారుపేటిక కటికిన దాక, యనుచరవర్గంబు దానిని రాజసమీపంబు చేర్చిరి. అంతట గౌతమసమన్వితుండై జనకభూపాలుండు, మహాసంతోసముతో నా మం దసము తెరువగా నందు వర్ష ర్తువునందలి మొదటి మెరుపుదీవ, వలె చూచువారల కనుల మిరుమిట్లుగొలుపు కాంతాలలామంబు సూపట్టె. అంతట గౌతమానుమతంబున నా బాలికామణిని పుత్రికగా స్వీక రించి శుద్ధాంతంబున రాణుల స్వాధీనముఁజేసి, యా బాలికామణి వృత్తాంత మారయఁగోరి, సవినయుండై, కులగురుండగు గౌతఋషి వరుం బ్రార్థింప నాసంయమి, తనయోగ విద్యామహిమచే నాశిశువు వృత్తాంత మంతయుఁ దెలిసి, యిట్లు చెప్పఁదొడంగె. భూపాలచూ డామణీ! యీ బాలికామణి పూర్వ వృత్తాంతము అతిరమణీయము. అపారమయిననుస్థాలీపులాకన్యాయముగానించుకవచియింపఁదలఁచితి, సావధానుఁడవగుము. సరస్వతీనదీతీరంబున ముక్తిపురంబను మునిపల్లె యొకటిగలదు. ఆ జనపదంబున వేదవేదాంగ పారంగతుండగు,ధరామ రవరుండు స్వశాఖాధ్యయనంబుగావించి, సాంగోపాంగముగాత్రయీ విద్య నభ్యసించి యాచార్యానుమతంబున గృహస్థధర్మపరాయణుండై, మహాభక్తుండయిపంచయజ్ఞ నియమ్రవతాచరణుండై అతిథులపాలి కామ ధేనువని పేరుమోసిన గుణవతియను నిల్లాలితో తమనడవడి సాటివార లకు వరువడిపంక్తిగాఁగ మెలఁగుచు లోకయాత్ర గడుపుచుండె. తల్లి దండ్రులు వానికిడిన యభిఖ్య వెలిగాకుండ, సీతని, నియమవ్రతాదు లీతనికి, వేదపురుషాభిధనలం దిక్కుల వ్యాపింపఁజేసె. సంపూర్ణ సుఖ సమేతుఁడై చిరకాలము పరమేశ్వ రారాధన పరాయత్తుండై మెలం గుచు నొకనాఁడు సంతానము బడయమికి మిగుల, వగలఁబొగలు, గుణవతినిఁ జూచి, యోదార్చి, యాస్వల్పకార్యమున కీచింతయెందుకు "తపోహి దురతిక్రమః" యను న్యాయ మన్యాయమగునా? తపస్సుచే సాధింపరాని కార్యముండదని, నీకోరిక నెరవేరునని యూరా కుభయ

హస్త మొసంగి, సకలసృష్టికారణమై యాత్మతత్త్వావబోధకమగు వేదపురుషుని, నిరంతర నిశ్వాసమాసాదితాంతఃకరణుఁడై, యారాధించి పుత్రప్రాప్తికరంబగు వరంబు వడసె. ఆవరప్రభావంబున, నచిరకాలంబుననే, గుణవతి గర్భవతియై, పిత్రూణ విముక్తిసాధనమై వంశాంకూరమగు కుమారుని, క్రమంబుగ నుభయవంశోద్ధారిణియగు నొక పుత్రికారత్నమును గాంచి యాదంపతులు సంసారసుఖంబులనుభవించుచు నీశ్వరాయత్తచేతస్కులై, వేదపురుషుఁడని, వేదవతి యనియు, బిడ్డలకు పేరిడి కొని, వారి ముద్దుముచ్చటలను మనసారఁ జూచుకొనుచు, ప్రొద్దు పుచ్చుచుండిరి. వేదపురుషుఁడు సకలవిద్యాపారంగతుఁడై తపోధనం మార్జింపఁ దొడఁగె. వేదవతి పసితనమందే, దైవయోగమువలన, మాతాపితరుల పుణ్యమువలన వారి నియమశీలాదుల ప్రభావమువలన, మహాభక్తురాలై సమస్త విద్యాభూషణ భూషితయై స్త్రీలోక శారదయగు, లజ్జావినయాదులచే సకలలోక హృదయాకర్షణియై వివాహోచిత వయస్కయై, తల్లిదండ్రుల యాజ్ఞను గొనినదై ముక్తికాంతవలె వారికి బ్రహ్మానంద మొసఁగుచుండెను. ఇట్టులా శిశురత్న మల్లారు ముద్దుగా పెరుగుచున్నతఱి స్వర్గసౌందర్యానంద కుతూహలిత స్వాంతుఁడై బ్రహ్మమానసపుత్రుఁడగు నారదుఁడు భూలోకమున గ్రుమ్మరుచు ముక్తిపురికరుదెంచి యచ్చటి ఋషిబృందారకులానంద బాష్పోదకంబుల దొప్పదోఁగ నారాయణ దివ్యమంగళ విగ్రహధ్యానంబు గావించి చనియె. వేదవతి యాపరమేశ్వరుని రూపవర్ణనానందమున మైమఱచి కొంతవడికి, స్మృతికలిగి యా వైకుంఠమూర్తిని వివాహమాడ దృఢనిశ్చయయై తల్లిదండ్రులు వలదని యెన్నివిధముల బ్రతిమాలినను వినక, రమాధవు డనుగ్రహించి చేపట్టునంతవరకు, నియమము వీడననియు, నితరుల పెండ్లియాడననియు, బ్రహ్మచర్యముగాఁ గాలము గడపెదననియు, శపథముచేసి, తపోనిష్ఠ నవలంబించె. ఎన్నివిఘ్నములు తటస్థించినను ధైర్యము విడక, పుండరీకాక్షుని నొప్పించి ప్రత్యక్షము చేసికొనినుగాని, పాపమామె కోర్కెసూత్రము తీరలేదు. పరమేశ్వరుఁ డామెప్రార్థన జన్మాంతరమందు

తీర్చెదనని యానతిచ్చి యంతర్ధానమయిపోయెను. అప్పుడు తపస్విని శ్రమణీవ్రతధారిణియై, ధైర్యకవచ సమాచ్ఛాదితయై, పరిత్యక్తబంధువర్గయై, గృహారామక్షేత్రాదులయందు విరక్తయై, కాననమే దివ్యభవనంబుగా పెంపుడుమృగంబులు చెలికత్తెలు, భక్తపరులు బంధువర్గముగా, పరమేశ్వర లీలావిలాసాదుల శ్రవణమనన, నిదిధ్యాసాదులు, సంతానాదులుగా, జగత్రయ సామ్రాజ్య పరిపాలనమొనరించి భగవద్ధ్యాన నిష్ఠాగరిష్ఠయై మెలంగుచుండె. ఇట్లు సహజ సౌందర్యగరిమకు తపోతేజంబు మూర్తీభవించి, శరీరకాంతి నలుకెలకుల తొలికిసలాడుచుండ భూలోక దేవతామణివలె నమూల్య తేజోవిభవాభిరామయై యలరారుచుండె. నాకాలమున సతులపాలిటి ధూమకేతువయిన రావణుడను రాక్షసరాజు, సింహళద్వీపమును రాజధానిగా జేసికొని, ముల్లోకములం బరిపాలించుచు, బాధించుచు, దేవతాంగనల సహితము చెరయందుంచుచు, సకలజన పీడాకరుండై యుండె. అతండొకనాడు విలాసార్థము ప్రకృతిచిత్రములం జూచును, వేదవతి నివసించు మహారణ్యంబు ప్రవేశించి, యప్రతిహత తేజోవిరాజితయగు వేదవతిం జూచి, మదనవికారమునకు లోనై పలువిధముల నామెను వివాహమాడ బ్రతిమాలియు, బెదిరించియు, ధనదానాదులచేత లోభింపజూచియు, నామెచే తిరస్కరింపబడి, కామాంధకారమునం గన్నుగానక, వేదవతిం బలవంతముగా వివాహమాడమని బోధింప నాబాధ సహింపజాలక, ఓరీ! గర్వపోతా, శ్రీమన్నారాయణున కర్పించిన, యీదేహమును, మహాపాపుడవగు నీవు ముట్టితివి గావున, యీశరీరమునువీడి, నీవంశనాశనమొనర్ప నీయింట జనియించెదనని శాపంబొసంగె. యోగాగ్నిచే తన శరీరమును దహింపజేసికొని ప్రాణముల బాపికొనియె. రావణుం డాసతీప్రభావమున కచ్చెరువందుచు, శోకశల్యమునకు పరితాపమందుచు, విరహావస్థచే నస్వస్థచిత్తుండై యెట్టకేలకు లంకాపట్టణమునకుం జేరి యథాస్థితినుండె. అంత తపోవిభవాభిరామయగు వేదవతి, కొలదికాలమునకే, రావణుని నందనోద్యానమున కలంకారభూతమగు సరోవరంబున, వెయ్యిరేకులుగల యొక తామరపువ్వునందు కమలాలయాంశచే జన్మించెను. దశగ్రీవుం

డొకొనాఁడు జలకేళీవినోదమునఁ గాలముగడుపనెంచి, దేవాంగనా సమేతుఁడై యథేచ్ఛగా జల్లులాడుచు, వెలిదమ్ములఁ గోయుచు, కారుదున్న నీటిపడియల దొరికినటుల వివేకశూన్యుఁడై క్రిందుమీదుఁ దెలియక నీసులాడుచుండ బంగారుబొమ్మవలె ముద్దుమూటకట్టగుఁ బాలికామణి గలిగి తామరపువ్వునుఁ జూచి కాలవశం బునఁ బూర్వవృత్తాంతము మరచినవాఁడై, యా శిశురత్నము గైకొని సభాస్థలి కరుదెంచి, యీ పసిండిబొమ్మఁబోలిన పిల్ల దానిని, ధర్మశాస్త్ర వేత్తలకు, దైవజ్ఞులకుఁ జూపింప, వారు, సాముద్రికాదులచేతను, సమయ విశేషములచేతను పరిశీలించి, యీ చిన్నది, లంకా వినాశనమునకై జన్మించినది. కావున నీయింటనుంచక దూరముగా విడువవలయునని చెప్పిరి. కాని బాలికాసౌందర్య విమో హితుఁడగు రావణుఁడు వీడఁజాలక, ప్రాణహానికి భయపడి జాతరూప వినిర్మితమగు నీ మందసమున నిడి, తన యనుచరులచే నీదేశమునం దు పారవేయించెను. ప్రాణమున్న యెవరికి తీపియుండదు, ఓ విదేహాధి పా యోగ్య వృష్టిచే సర్వము కనులకుఁ గాన్పించుచున్నది. యీ చిన్నది మహాలక్ష్మి, నీ వంశమును తరింపఁజేయ, నీ జ్ఞాన నిష్ఠాఫలం బుగా నీ యింట నవతరించినది. ఈమె సూర్యకుల ప్రదీపకుడగు రాముని వివాహమాడి తాను కారణమయి, దశకంధర, శతకంధర, సహస్రకంధరులను దనుజవల్లభులఁ బరిమార్చి, భూదేవిని నిష్కంట ముగాఁ జేయును. నీ వీ బాలికామణి, జగదీశ్వరిగాభావించి, భక్తిచేఁ బెంచుచు పుత్రికాప్రేమఁ జూపుచు నీ జన్మ తరింపఁజేసి కొనుము. సాక్షాద్భగవంతుడు నీ యింటియల్లుడు కాఁగలడు. యావేడుకఁజూచి మేమందఱము తరించగలమని చెప్పి గౌతముఁడు, యాగశాలా నిర్మాణ నియమ వ్రతాచరణాకై చనియె. విదేహభూపాలుడు తనకుఁగలిగిన మహాభాగ్యమునకై యపరిమితానందమును బొందుచు, కాలముగడు పుచు పురోహితాను మతంబున, నాబాలికను నాగలిచాలున దొరి కినదగుటచేత, నాగలిచాలని యర్థమునిచ్చు, సీత యను నామధేయ మేర్పరిచి, సంతసమునఁ గాలముగడుపుచుండె.

ఉత్తర కోసలదేశంబున సుప్రసిద్ధమగు సాకేతనగర పరిపాలకుండగు దశరథ నరాధీశుండు సంతానహీనుండై కులగురువగు వసిష్ఠానుమతంబున, ఋష్యశృంగు నధ్వర్యునిగాఁ జేసికొని పుత్రకామేష్టి యను యాగంబొనర్ప, భగవంతుఁ డనుగ్రహించి, పాయసరూపంబునఁ గౌసల్యాదుల గర్భమునందుఁ బ్రవేశించి రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను నామములతో సంకర్షణ ప్రద్యుమ్న, వాసుదేవానిరుద్ధనామంబులం బరగు వ్యూహచతుష్టయ, ప్రతిరూపము యన ధర్మసంస్థాపనకొఱకు, త్రిలోకకంటకులగు, రావణ కుంభకర్ణాదుల వధియింప నిలాతలంబున నవతరించి, పంక్తిరథుని పున్నామనరకమునుండి తొలంగించి, బాల్యలీలావిలాసంబున చూచువారల కమితానందదాయకుఁడై మెలంగుచుండె. దశరథుండును, అఱువదివేల వత్సరములకు గలిగిన సంతానమును చూచుకొని ముచ్చటల మురియుచు యథాకాలముగాఁ జౌలోపనయనాదుల నొనరించుచు, సకలవిద్యాపారంగతులఁ గావించె, కుమారచతుష్టయము పరస్పరానురాగ సంపద నేకశరీరము వోలె మెలంగుచుండె, ఇట్టించుమించుగ, పదునారు వత్సరముల ప్రాయముగలవారలయి సర్వజన నయనానందసంధాయకులై మెలఁగుచుండ, మారీచ సుబాహులను దానవుల బాధలకుఁ దాళఁజాలక విశ్వామిత్రుండు దశరథుని సమీపమున కరుదెంచి, వసిష్ఠానుమతంబునఁ బుత్రుల నిజస్వరూపము బోధించి రాక్షసవధార్థము యాగసంరక్షణ మిషంబున రామలక్ష్మణులఁ దన తపోవనంబునకుఁ దోడుకొని పోవుచు లోకాపకారిణియగు తాటకిని వధింపఁ జేసి, మారీచుని పారఁదోలి, సుబాహుని రూపుమాపి, యజ్ఞము నిర్విఘ్నముగాఁ గాపాడిన రామునకు సమస్త దివ్యాస్త్రములుపదేశించి, యమూల్యప్రతాపవంతుల గావించి గాధేయుఁడు దాశరథులఁ గాపాడుచుండె. జనకుని ముద్దుకూతురగు సీత పసితనమున నాఁడుకొనుచుఁ, జిరకాలముగా జనకునియింట పూజామందిరమునఁ బూజింపఁబడిన శివధనుస్సును చూచి బంతివలె నెత్తుటను జనకుం డాలకించి యీమె మహాశక్తియని నిశ్చయించి, యమితబలాఢ్యున కీయబలనిచ్చుట శ్రేయస్సుగాఁ దలంచి, యీ శరాసన

మును వంచి శరసంధానమును గావించిన వానికి సీతనిత్తునని యిలా తలంబున చాటంబనిచె. యీవార్త లాలించి విశ్వామిత్రుండు వింత ధనువును గనుంగొన రామలక్ష్మణ యుక్తుడై మిథిలాపురంబున కరుదెంచి, యనేక రాజకుమారాదులచే నలంకరింపఁబడిన సభ నలంకరించెను. జనకుండు రామలక్ష్మణసహితుండయిన విశ్వామిత్రుని సగౌరవముగఁ బూజించి, యనేక శతసంఖ్యాకులచే నా శరాసనము దెప్పించి పరిషన్మధ్యంబున నిల్పె. ఆ సమయంబున త్రిలోకవిజయమందిన రావణుండు చనుదెంచె సీతాదేవియు పూర్వజన్మ స్మృతికలదియై, భగవంతుని వరియింప స్వయంవరాలంకృత వేషముతో సభాస్థలి కరుదెంచెను. ధనువునెత్త రాకుమారులు ప్రయత్నించిరిగాని వ్యర్థఫలులైరి. రావణుండు ధనువునెత్త సమీపించుచుండె సీతామహాదేవి గుండె జల్లుమనియె. శివభక్తుఁడీ దానవుఁడు కార్ముకము నెత్తునేమో, తాను వరించవలయునో యని పరితాపమందుచు వేల్పులారా! యీ ధనువునుఁ మీ శక్తులఁ బ్రవేశ పెట్టుడు. భగవంతుని దప్ప నన్యపురుషుని వరింపను నాకు సాయ మొనరించుడని ప్రార్థించుచుండ నేమిచిత్రమో కాని, కైలాసపర్వతమును కదల్చి యూపిన రావణుని భుజబలము వ్యర్థమై ధనువునెత్త లేదు సరిగదా కదల్పఁజాలక పరిహాస పాత్రుడయ్యె యింక మిగిలినవాఁడు రాముఁడే. త్రిలోకసుందరుఁడు నీలమేఘశ్యాముఁడు మందహాసాలంకృత వదనారవిందుఁడు జగజ్జేగీయమాన పరాక్రముండు, గాధేయానుమతంబునమత్తకరీంద్రమువలె, శివకార్ముకము నెత్తుటకై చనుచుండె, జానకీ హృదయానంద రసము పొంగి పొరలి వెలివారుచున్నదాయను నట్లానందబాష్పములు నేత్రకోశములనుండి జలజలరాలఁజొచ్చె పలువిధములగు కోరికలా మహాసాధ్వి హృదయంబున మొలకెత్తసాగినవి రామచంద్రుని సుకుమార మాతల్లి హృదయ మూ కర్షించుచుండె. కమఠపృష్ఠ కఠోరంబగు కార్ముకంబా యిల్లాలి మనోదైన్యమునకుఁ గారణమయ్యె. యీ సుకుమారుడు కార్ముకమెత్త నక్కరలేదు. నేను స్వయముగా వరించుచున్నాను యీశుల్క మనావశ్యకమని చెప్ప యత్నించినది. కాని, పుట్టినస్థిర, క్షమయని సార్థకనామములు వహిం

చిన భూదేవికి, తల్లిగుణములు బిడ్డయందేల సంక్రమింపవు. స్థిరచిత్త యయినది ధనువు పుష్పాకృతిగావలయునని, కులదేవతల వేడుకొన్నది. పతివ్రతాభీష్టముఁ దీర్పకుండుట కెవరుసమర్థులు, త్రిమూర్తులు మొదలు, సమస్త ప్రాణికోటియు పతివ్రతాప్రభావమునకు నమస్కరించవలసినదె, పిపీలికాది బ్రహ్మపర్యంతము సాధ్వీతిరస్కారమునకు భయపడవలసినదె. వేల్పులు క్షైమోద్ధ్వపలు ఘటించినారు. తథాస్తు దేవతలు తథాస్తు అన్నారు సీత, ఆత్మత్యాగముఁ జూపించ దలఁచి భావికర్మానుకూలముగా రాముఁ డీకార్ముకమెత్తినఁ దాను పదునాల్గువత్సరము లరణ్యవాసముఁ జేసి, సద్యస్కందయాగముల దేవతాప్రీతి గావింతునని మ్రొక్కుకొనియె. దేవతలు దీవించిరి. రాముడు శివకార్ముకంబునకు నమస్కరించి గాధేయ గౌతమానులకు మ్రొక్కి విల్లునెత్తి నారిసారించి శరంబునెక్కుంప నించుకంత చాపము వంచె, పెళ్లుమనివిరిగెను ఆధ్వని వినువారలు బధిరులయిరి. జానకీదేవి శరీరము పులకలుదిగఁబోసె జనకభూపాలుం డానందసరోవరాంతరంబున నిమగ్నుండయ్యె. రావణుఁ డసూయాగాఢసముద్రమున మునిగిపోయె. వేల్పులు కుసుమవర్షము గురిపించిరి. అంతట శుభముహూర్తంబు గాధేయానుమతంబున దశరథాదుల రావించి యథాశాస్త్రీయముగ శ్రీ సీతారామకళ్యాణము జరిగినది. పిమ్మట సీతామతల్లితో సాకేత పురాభిముఖులయిరి. మార్గమధ్యమున పరశురాముఁ డెదుర్కొని శివధనుర్భంగము గావించినందుకు శ్రీరాముని తన వైష్ణవకార్ముక మెక్కువెట్టుము లేనిచో నాతో రణమొనరించుమనియె. రాముఁడా వైష్ణవాస్త్రమును గ్రహించెను. పరమ సాధ్వియగు సీత రాముని దిగ్విజయమొందుమని పలికినతోడనె పరశురాముని తేజంబు రాముని యందుఁ బ్రవేశించినది. వైష్ణవశరాసనము బెండువలె తేలికయ్యె. పరశురాముఁడా పతివ్రతాప్రభావమునకు నమస్కరించి రాముని దీవించి చనియె. దశరథాదు లయోధ్యాపురికి చేరిరి. పదిరెండు వత్సరములు పుత్రుల వైభవము చూచుచు రాముని సుగుణసంపత్తి కానందించుచుఁ గాలముగడిపి రాజ్యపరిపాలనమందు విరక్తుఁడయి ప్రజానుమతంబుగ రామునకుఁ బట్టముగట్ట నిశ్చయించెను. పట్టణ మలంక

రించిరి. సీతయు, రాముఁడు పట్టాభిషేకోచిత వేషధారులయిరి. ప్రజలు రాజులకుఁ దగిన పారిబర్హ్యములతో నభిషేకకాల మెదురు చూచుచుండిరి. సీతామహాదేవి తాను చేయవలసిన రావణ వధా విధానమున కనుకూలముగాఁ దాను వివాహసమయమునందు వేల్పులకు మ్రొక్కిన మ్రొక్కునుఁ దీర్పఁదగు కాలమిదియే యని, మానసమునఁ గోరెను. ఆ యీలువరాలి తేజము లోకాంతరములయందు వ్యాప్తమయినది. సృష్టికిఁ బ్రతిసృష్టి యయినది. బ్రహ్మదేవుఁ డల్లాడిపోయినాఁడు. మాయా నటకురాలిని సృష్టించినాఁడు. మంథర వేషము వేయించినాఁడు. కైకేయి వద్దకు పంపినాఁడు. కైకేయి వద్దకు మంథర వచ్చినది. రామునియం దామెకుగల ప్రేమాతిశయమును ఈర్ష్యారూపముగా నూరుపు నొందించినది. కైకేయి దశరథుని పాలిటి కాళరాత్రి యయినది. దశరథుఁడు ప్రేమపూరితుఁడై భరతమాత శుద్ధాంతమున కేతెంచినాఁడు. ప్రపంచమంతయు జానకీ సతీప్రతాప మరీచులు నిండిపోయినవి. కనులు మిరిమిట్లుగొలుపుచున్నవి. కేకయ మహాపాలనం దన కాలసర్పమువలె బుసగొట్టుచున్నది. దశరథుడు దిగులుపడినాఁడు. విషవాయుపూరితమగు శుద్ధాంతమున దంపతు లోకకారణమున రాద్ధాంత సిద్ధాంతపక్షములు చేపట్టిరి. ప్రాతయప్పు పైఁబెట్టినది. వరధనము వడ్డితో నీగమన్నది. దేవేంద్ర సంగ్రామము జ్ఞాపకము చేసినది. తానాసమరమున సారథియై యేరాజు ప్రాణమును కాపాడినదో యాభూపాలుని ప్రాణవియోగమున కీమంధరా రచితనాటకమున సారథ్యము ప్రారంభించినది. రామునికిఁ బదునాలుగేం డ్లరణ్యవాసము. భరతునికిఁ బట్టాభిషేకము గోరినది. దశరథుడు మూర్ఛపడినాఁడు. పట్టాభిషేక సమయమయినది. రాముఁడు పెండ్లికొడుకువలె ముద్దులు మూటఁగట్టుచు గుర్వాజ్ఞ నిరీక్షించుచున్నాఁడు. దశరథునిఁ బిలుచుటకై సుమంత్రి కైకేయీ మందిరమున కేఁగినాడు. ఆమె రాముని బిలుచుటకై యాజ్ఞాపించినది. రామచంద్రుఁ డరుదెంచినాడు. తండ్రి యవస్థఁ గనుగొనినాఁడు. సవతితల్లి సర్వవృత్తాంతము, ఘినుపించినది రామభద్రు డానందముతోఁ దండ్రిని మేలుకొలిపి

ధైర్యముచెప్పి యసత్యమాడవలదని, తన వనప్రయాణము సత్యమని చెప్పి, యావార్త కౌసల్యాదుల కెఱింగించి వైదేహి చెంత కేగెను. సీతాదేవి కోరిక నెరవేర్చుకొన నువ్విళు లూరుచుండెను. మామగారు కేకయరాజనందన కొసంగిన వరదాన మాలించి రామునకు నమస్కరించి, వనప్రయాణమునకు సిద్ధమాయెను. రాఘవుఁడామాట వినకపోయెను. సీత ధైర్యమువహించి, భార్యను పోషింపఁజాలక విడువవలదు. వివాహమంత్రముల జ్ఞాపకము చేసికొనుడు. ప్రమాణముల స్మరణకుఁ దెచ్చుకొనుము. భర్తృవియోగము సీత సైచదు నన్ను విడిచిపోయిన నీవనవాసదీక్ష పూర్తికాదు. సాధ్వి కోరిక దీర్పకుండ నడుగుదాటవలదని ప్రార్థింప దాశరథి యామె పలుకుల రహస్యము గ్రహియించి యామెప్రార్థన మంగీకరించెను. సౌమిత్రిగూడ వెంటవచ్చెదనని ప్రార్థించెను. రాముడంగీకరించి భార్యాసోదరులతో నడవుల కేఁగెను. కౌసలేయుని యెడబాటు సైపలేక దశరథుడు మరణించెను. భరతశత్రుఘ్నులు మాతామహులయింట నుండిరి. వారికిఁగబురంపి,యజనందనునకు నగ్నిసంస్కార మొనరించిరి. భరతుఁడు తల్లి ద్రోహబుద్ధిఁ దెలిసికొని సీతాపాతివ్రత్యమహిమ నభినందించుచు సీతారాముల పాదములమీఁదఁబడి నీపాపమును బరిహరించుకొనుమని మెడబట్టి నెట్టుకొని సమస్త పరివారముగూడరా, వశిష్ఠపురోగముఁడై చిత్రకూటమున రాముని దర్శించి, రాజ్యము స్వీకరించుమని ప్రార్థించ, పితృవచన పరిపాలనానంతరము స్వీకరించెద ననియు నంతదనుక నామారుగా నీపాదుకలఁ జూచుకొమ్మనుచు, పంపివేసి, తాను ఋషిసత్తముల సేవించుచుఁ బదమూఁడు వత్సరములు గడపెను కాలక్రమమున గోదావరీ తీరంబునం గల పంచవటి యందును పర్ణశాల నిర్మించుకొని కాలము గడుపుచుండఁగా నాప్రాంతమునఁ దిరుగు శూర్పణఖ శ్రీరామునిఁ జూచి మోహించి వరించమని ప్రార్థించి నిర్బంధించెను. పతివ్రతయగు సీతపై శూర్పణఖ తనమాయాజాలము ప్రయోగించెను. సూర్యునిముందు తిమిరమువలె రాక్షసీ మాయ సర్వము వ్యర్థమాయెను. సీతాసందర్శనము శూర్పణఖకు పిచ్చిపుట్టించినది. అభి

మానము వదలినది. ఉరిలోబడ్డ పిట్టవలె యల్లాడినది. లక్ష్మణునిచే పరాభవింపఁబడినది. తనయవమానము సోదరుఁడగు రావణునికిం దెలిపి సీతయందు మోహము కలిగించినది రావణుఁడు మారీచ సహాయముచే సీతను హరించదలఁచెను జానకి యీవృత్తాంతము పెనిమిటికిఁ దెలియఁజేసి, తన యాత్మశక్తిని యగ్నిలో దాచుకొని సర్వవ్యాపినియై పాతివ్రత్య మరీచిజాలములఁ, లంకాపట్టణముపై వ్యాపింపఁజేసెను. కాలమృత్యుపాశములవలె రావణుని చుట్టుకొనెను. దశగ్రీవుఁడు మరణావస్థకు లోనయినాఁడు మారీచుని బంగరులేడిగా పంపి శీతారాములకు వియోగము కల్పించి వేషధారి యగు సీతను దొంగిలించుకొని, మార్గమధ్యమున జటాయువు వధించి సింహళము చేర్చెను. రామలక్ష్మణులు పర్ణశాలకువచ్చి సీతనుగానక కాననంబు వెదకి సుగ్రీవసహాయముఁబొంది, వాయునందనునిచే సీతా వృత్తాంతమారసి, రావణ వధార్థము, సముద్రమున వారధిగట్టి వానర సేనాసమేతుఁడై లంకను ముట్టడించెను. రావణుండు మంత్రాలోచన మొనర్చెను. సోదరుఁడగు విభీషణుఁడు పరస్త్రీని బలాత్కరించుట న్యాయముకాదు. కావున జానకిని, రామునకర్పించి నమస్కరించిపంపిన మన వంశమునిలుచును. లేనిచో నశించునని చెప్ప రావణుడు సోదరునిఁ దిరస్కరించి రామునితో రణమొనరించుటయు సిద్ధాంతమొనరించెను. విభీషణుడు రావణునివీడి రాముని శరణుఁ జొచ్చెను. రావణుడు సీతను బలవంతముగా వివాహమాడఁదలఁచెను. తగుసన్నాహముతో సీతా శోకపూరితమయిన యశోకవనము ప్రవేశించెను. పెనిమిటివ్యవసాయము మండోదరి త్రిజటాదులవలన విని, వైదేహివలన రావణున కపాయముకాదలంచి, తగు పరివారముతో నశోకవని కరుదెంచి యొకపొదరింటిచాటున, దాగియుండె, దశగ్రీవునిరాక దాశరథి యిల్లాలు కనుగొనె. మానభంగముకలుగునని యూహించె, రక్షించువారు లేరు. ఆత్మరక్షకు పరాపేక్ష లేదు, మానధనము గోలుపోవ చిత్తము సమ్మతింప లేదు. ప్రాణత్యాగమా, ప్రాణరక్షణమా, కర్తవ్యము యోచించినది. సతీధర్మమెంత దనుక నిలుచునా. అమేయమహిమకలదియా? అనుమిత సామర్థ్యమా సిద్ధాంత

పరుపఁదలచినది. ధైర్యకవచము తొడిగినది. సాహసచంద్రహాసము కరంబునఁ దాల్చినది, స్త్రీలకు స్వాతంత్ర్యమున్నదా, లేదా యను, సంశయమున కగ్నిపరీక్షయందు సిద్ధాంతపరుప దలచినది, ఆఁడుదాని స్వాతంత్ర్యసంచారము, భర్తృసన్నిధానమునందా శత్రుసన్నిధాన ఘంటాపథమందా, యను సంశయము క్రియారూపమున స్పష్టము సేయ సమకట్టినది. పాతివ్రత్య మంత్రాంగము జపము స్థిరచిత్తముతో రెప్పపాటు కాలము సలిపినది. మౌనముపహించినది. వీనులు మూసినది సతీధర్మానంద సముద్రమున మగ్నమయినది. భర్తను ధ్యానము చేసినది. సిరీషపుష్పకోమల మృదులమగు తనహృదయమును, కఠినమగు వజ్రశిలామయము గావించినది. దయారసము జారవిడిచినది. రాక్షసవంశము పాలిటి మృత్యుదేవతయయినది. తన పూర్వావతారములఁ దలఁపునకుఁ దెచ్చుకొన్నది. మహాశక్తి యయినది. శక్తిసేన నాకర్షించినది నేత్రగోళములనుండి క్రోధాంగారకణములు లంకాపట్టణంబున వెదజల్లినది. తామసమూర్తియయినది వీరభావినీవేషము వేసినది. కాని, సహజలావణ్య శోభయను తెరమాత్రము, తీయలేదు. జానకీ సహజసౌందర్యమా రావణుని మోసగించినది, గ్రుడ్డివానినిఁ జేసినది, పిచ్చియెత్తించినది, మనోవికారము కలిగినది. పిశాచవృత్తి ననుసరింపఁబూనినాఁడు. రామునశించినాఁడు. రావణుఁడు స్వతంత్రుడయినాఁడు రాజ్యము సర్వస్వము నీకు దారఁబోయనున్నాఁడు. వరియించకతప్పదు. తప్పించుకొనలేవు. ఇదిగో, వింశతి బాహువుల గాఢాశ్లేష మనుభవించు సమయమని ముందంజవేసినాఁడు. మండోదరి ప్రాణమెగిరిపోయినది. దేహముకంపమొందినది. పొదల్లు వెలువడినది. రక్షకము, రక్షకమని, పెద్దపెట్టునయేడ్చుచు, తన భర్తయగు దశగ్రీవుని కౌగిలించి మహాపాపము, శాంతింపుము మరణాంతప్రాయశ్చిత్తమగు దోసముసేయఁగూడదు. నామనవినివినుమని, బ్రతిమాలినది. కామామయతాపజ్వర పీడచే బధిరుడయినాఁడు. మృత్యువు సమీపించినవాఁడు, దీపమారిన కొడివాసన తెలుసుకొనలేడు. హితమగుమాట వినలేదు. కావున మండోదరిని, విదిలించినాఁడు. సీత పాదములమీఁదఁ బడినది. పైటచెరగుచాచినది. పతిభిక్షపెట్టుమన్నది.

సాటి యాడుదానిని పరాభవింపన్యాయము యని రెండు పాదములు పట్టుకొని కన్నీరు జలజల కార్చినది. పిడుగు పడినరీతి పడిపోయినది. విస్మృతిం జెందినది. వైదేహి యించుక యోచించినది, రావణవధ రాముని చేఁ జేయించుట యుచితమని తలంచినది. భారతదేశమం దవత రించినందులకా దేశాచారముగూడఁ బాటించుటధర్మమని యూహించి ప్రకృత మించుక రావణునకు మనోవికారము, కలుగునట్లు, తనప్రతా పము ప్రదర్శించి, పతివ్రతలను చెనకు దుర్మార్గులకు రాఁబోవు ఫల మిట్లుండునని తెలియఁజేయఁదలఁచి యెండిన గడ్డిపోచ చేపట్టినది. ఓరీ, పర స్త్రీ పరాయణా! సాధ్వులు నిన్నీ గడ్డిపోచతో సమాన ముగాఁ జూతురు, యీలువ సాహసించి, విడిచిన యీ గడ్డిపోచ, రాముని చే విడువఁబడి, కాకాసురుని హరించిన తృణమువలె నీ ప్రాణ ముఁదీయుట కిది చాలును, యీ గడ్డిని, నములు జంతువులు పతివ్రతల బాధించు, నీవంటి శూరులు, సమానులఁగాఁ దలంతురు. నిర్జీవమయి జడమునైన ఘాసమునైనఁ గనులఁజూడ పతివ్రతలు దలంతురుగాని, నీవంటి నీచులమోము చూడరు నీకు, వినాశకాలము దాపురించియే నావంటిదానిపై మరులుకొన్నావు బ్రతుక కోరిక యున్న లేచిపొమ్ము, చేసిన యపరాధమునకుఁ జెంపలువేసికొని నమ స్కారము చేయుము. సుగుణాభిరాముఁడు రామునకు జోహారనుము, సిగ్గుపడుము, యింకమీఁద నిటువంటి దుష్కార్యము సేయకుమని, మండోదరీ ప్రార్థనావశమున, కొంచెముశాంతివహించిన, మనంబుతో రావణునకు బుద్ధి చెప్పెను. కాని పాప మాతఁడేమి చేయఁగలఁడు. ప్రారబ్ధ మనుభవించక తీరదుగదా! యెంతవాఁడైననేమి, ఎంతపాండి త్యమున్న నేమి, తపోబల మున్న నేమి, యేమియున్న నేమిలాభము. యీషణత్రియములలో బలవత్తరమయినది, దారేషణ వలచినయా డుదానిని, విడువలేక, యొకానొకప్పుడు, ప్రాణములుగూడ విడుచు చున్నారు. మండోదరి బెగడుపడినది, బెదురుచూపులు చూచినది, కనులు జలపూరితము లయినవి, సీతకు మ్రొక్కుచున్నది, రావణుని కనులతో బ్రతిమాలుచున్నది, ఎవరిని యేమనజాలదు. దిగులుపడి

సీతవంకఁ జూచినది. సీతశరీరమందలి సుకుమారపు తెర లేచిపోయి నది. రౌద్రమూర్తియయినది. సహస్రవదన యయినది. వదనకుహర ములనుండి నిప్పుమంటలు మిన్నున కెగఁబ్రాకసాగినవి. నిశ్వాస మారుతము వెదఁజల్లినది. నోరు తెరచినది. కోరలు తాటించినది. నాలుకను సాచినది. సింహాళమును మట్టడించినది. రావణునిపై చూపు నిగుడించినది. అగ్నివర్షపు జల్లు ప్రారంభమయినది. రావణుఁ డు స్తబ్ధుడయినాఁడు. చిత్రప్రతిమవలె నిలువఁబడినాఁడు. గుడ్డపీలికల వలె నిరువదిచేతులు వ్రేలాడసాగినవి. తల తిరిగినది. కనులు మూత బడినవి. జీవియా, నిర్జీవియా యను సంశయ మేర్పడినది. పట్టణస్థులు హఠాత్తుగ బెగడుపడినారు. భూమి కంపించినది. ఉల్కలు రాలినవి. సముద్రములు పొంగి యెసటిసీటివలె దెరసాగినవి. పచ్చిరక్తపు టేర్లు ప్రవహించుచున్నవి. లంకాపురవాసు లాబాలగోపాలము శరీర పరితాపములచే నుడకి కుములసాగిరి. వాయుసంచారము మంద మయినది. సూర్యుడు దేజోహీనుడయినాడు. పగలు చుక్కలు పొడిచినవి. మండోదరి కనులు తెరచినది. నలుకెలకులు పరికించినది. తేజోమూర్తినిఁ గాంచినది. నమస్కరించినది. "భిక్షాం దేహి" యని నది. మంగళసూత్రము చూపించినది. దోసలిమొగ్గినది. జానకీ హృదయసీమ వ్రక్కలయినది. అగ్నిగుండము ప్రజ్వరిల్లుచున్నది. త్రిమూర్తులు కరాళముఖులయి హోమము సలుపుచున్నారు. దానవ వీరులు దొర్లుచు తమంతట తాముగా నగ్నిగుండమునఁ బడుచున్నారు. స్వప్నమా! జాగ్రతయా! మయపుత్రి యించుక సేపు గ్రహింపఁజాలక గారడిగాఁబోలు! లేదా గంధర్వమాయ కావచ్చును. విస్మయము, భయము చుట్టుముట్టినవి. వెక్కిచూపు చూచుచుండగ తనభర్త రావణుఁ డగుపడినాఁడు. సాధ్వీమతల్లి దిగ్భ్రమనొందినది. భావి కార్యము యోచించినది. తన మందలింపు ప్రయోజనము లేదని నిశ్చయించినది. పాపమునుండి భర్తను కాపాడఁదలఁచినది. వైదేహికి నమస్కరించినది. పెనిమిటినేత్రములు తుడిచినది. రావణుని శరీరము చల్లపడినది. జ్ఞానాంకురములు మోసలెత్తినవి. వైదేహినిఁజూచినాఁడు. పరాశక్తియని తెలిసికొనినాఁడు. ఆశక్తిహృదయగోళమున మేడిపండున

దోమలతుటుములవలె, బ్రహ్మాండములు కోట్లకొలఁది కనుపించినవి. అబ్బురపాటుతోఁ జూచుచుండ వైకుంఠము కనుపించినది. శేషపాన్పున నారాయణుఁడు లక్ష్మీదేవితో కనుపడుచున్నాఁడు. సనకసనందనాదులు, లోపలఁ బ్రవేశించఁబోవుచున్నారు. విజయు డడ్డుపడినాఁడు. కుంభకర్ణుఁడుగా మారినాఁడు. జయుఁడభ్యంతరపరచి యాదిమానుల నవమానించినాఁడు. పదితలతకీటమయినాఁడు. అధోగతి నొందుచున్నాఁడు. శరణాగతి నందినాఁడు. అమ్మా! యని వాపోయినాఁడు. కొలఁదికాలములో నీ స్వరూపమును ధరించఁగలవని యశరీరవాణి పలికినది. భూమండలమునఁ బ్రవేశించినాఁడు. యింతలో రావణునకు, మాయ క్రమ్మినది. ఆరంగము మారిపోయినది. సీతారామలక్ష్మణులు వాయుపుత్రునితో సీతాహృదయ సౌధమున వెలుగొందుచున్నారు సీత సైగ చేసినది. ఆంజనేయుఁడు మింటికెగిరినాఁడు. మహాశక్తిని సమీపించినాఁడు. వదనగుహావినిర్గత దవాగ్నులలో నైక్యమయిన్నాఁడు. దశగ్రీవుఁడు విస్మృతినందినాఁడు. లంకాపట్టణము, కానుపించినది. నగరవాసు లల్లాడుచున్నారు. లంకాపట్టణము దహనమయినది. కోట్లకొలఁది దానవులు భస్మమై పోయినారు. గ్రామమంత మహా స్మశాన మయినది. మారుతి మంటలతో వెలుగుచు రావణుని సమీపించినాఁడు. దశకంఠుఁడు యుద్ధప్రయత్నము సలిపినాఁడు. కాని, అశక్తుఁడయినాఁడు. భీతిపడినాఁడు. మండోదరినిఁ గౌగలించుకొనినాఁడు. ఆ పతివ్రత శరీరస్పర్శచేత దివ్యదృష్టి తిరుగా గలిగినది. సీతా మహాశక్తి కనులముందర తాండవము ప్రారంభించినది. కుంభకర్ణాది రాక్షసులు రామబాణములఁ దోయబడి వైదేహీహృదయ ధూమధ్వజ కుండమున కాహుతు లగుచున్నారు. మేఘనాదాదులు శిరోహీనులయి మహాశక్తి కోరలసందున, నలిగిపోవుచున్నారు. లంకాపట్టణము చూర్ణమయినది. రావణుఁడు జయస్వరూపము నందినాఁడు. నవీనసృష్టి జరిగినది. విభీషణుఁడుపట్టాభిషిక్తుఁడయినాఁడు. సీతాదేవి శోకపూరిత యయి, యశోకావనీరుహము క్రింద శయనించియున్నది. రావణుఁడు తగు పరివారముతో సీతా

మోహావశంవదుఁడై మండోదరినిఁ జూచిఁ సిగ్గుపడి శుద్ధాంతమున కేఁగినాఁడు.

రామచంద్రుఁడు వానరసేనలను పురికొల్పినాఁడు. మహాయుద్ధము ప్రారంభమయినది. రాక్షససైన్యమంతయు జాంబవంతుఁడు, వాయుపుత్రుడు, మఘవానుని పౌత్రుఁడు, భాస్కరతనూజుఁడు విదేహనాధతనూజాతకు నమస్కరించి రూపుమాపఁ గడంగినారు. విజయము నందినారు. అంతఃపురమున రావణునకు సీతాపరాశక్తి సందర్శనమున పూర్వస్మృతి గలిగినది. తాను శరీరము విడుచునాటి కీ తరుణంబె సమయము లేదని నిశ్చయించినాఁడు. ఇంతలో మండోదరి సమీపించి వినయపూర్వకముగ నిట్లు విన్నవించినది. ప్రాణనాయకుఁడయిన నాకు జానకి వార్తనంపినది. సారాంశమిది: నీవును సాధ్వివి, సాటిసాధ్విని పరాభవించుట కీవు సమ్మతింతువుగదా? నాథుని ప్రాణమును కాపాడుకొనుము. సతీవ్రతాపదావాగ్నికీలలే మూలకు కోపమారుత ప్రేరితములై విసరునో, తెలిసికొనవలె నెవ్వరికి? కావున సముద్ధరాలవయిన రావణుని దుర్వ్యాపారము తొలఁగింపుమని. దశగ్రీవుండీవార్తవిని, హృదయేశ్వరీ! నీవు నాతోడ మాటలాడఁదగిన విషయము లేదు. నాజన్మ కడతేరుటకు నే నీయుపాయము పన్నుకొన్నాను. ప్రారబ్ధ మనుభవించక తీరదు. నాకు పరమానందమగు వైకుంఠమున దివ్యసౌధ నిర్మాణ మాయినది. విభీషణుడు నన్ను బాసి శత్రువులలోఁ జేరినాఁడు. మహాబలశాలి కుంభకర్ణుఁడు పరలోకమున కేఁగి విష్ణుపార్శ్వదుఁడై నాకొఱకు కాచుకొనుచున్నాఁడు. ఇంతకు నీకడుపున చిచ్చుదాఁకొలిపి, ఇంద్రజిత్తు లక్ష్మణుని చేతిలోఁ జచ్చినాఁడు నేను బ్రతుకుట యెవరికొఱకు, అనుచు రావణుఁడు పలుకుచుండ, పిడుగు మీఁదఁబడినట్లు మండోదరి మూర్ఛిల్లినది. యిల్లాలు చచ్చినదిగా నిశ్చయించుకొన్నాఁడు. రౌద్రరసము మూర్తీభవించినదా యనునట్లు భీకరమూర్తియై సీతను నరికివేసి యీదుఃఖమును తొలఁగుదునని చంద్రహాసపాణియై శుద్ధాంతమునుండి బయలుదేరెను. సర్వవ్యాపినియగు సీతాపరాశక్తి ప్రత్యక్షమై రావణుని మెడకుఁ దగిల్చినది. రామమూర్తిచేతను లాగుకొనిపోయినది. దేవేంద్రుని

రథము స్వర్గమునుండి మాతలియును సారథియై దిగినది. రాముడు రథారూఢుడయినాఁడు. రావణ ప్రతిమ కనులఁబడినది. జానకీదేవి, వీరరసపూరితయై, సహస్ర శరాసనములతో, బాణవర్షము గురియుచున్నది. దశకంధరుఁడా శరప్రవాహము తల మున్కలగుటచే, నీడలేక, యూపిరి త్రిప్పుకొనలేక యల్లాడుచున్నాఁడు. యుభయసైన్యములవారలీ చిత్రసమరముఁ దిలకింప, రెండుగడియల కాలము, విశ్రాంతిఁ దీసికొనినారు. రాముఁడచ్చెరువందినాఁడు. యథార్థము గ్రహింపలేక పోయినాఁడు. పరాభట్టారికను ప్రార్థించి యథార్థము తెలిసికొని, తల్లీ! రావణుని వధించెదనని ప్రతిన బూనితి నన్ను యథార్థ వచనునిగఁ జేయుమా! యనినాఁడు. చిత్తైకాగ్రత కలిగినది. రావణుఁడు నమస్కరించి, తల్లీ! నాసర్వస్వము నీ వెఱుఁగనిది కాదుగదా? నాజన్మ తరించినదిగా? అమ్మా! రా! రాముఁడా! నన్ను చంపువాఁడు? మహాశక్తివి. నామూర్తులు నీచేతి కీలుబొమ్మలు. నీచేతఁజచ్చుటకన్న నాకుఁగావలసిన విశేషమేమున్నది? సంసిద్ధుఁడను. "ఇదం బ్రాహ్మ్యమిదం క్షాత్రం" బనిగదా న్యాయము? నాచేతి నేర్పు క్షణకాలము కనుఁగొనుము. నీ పిల్లవాఁడెంతటి పరాక్రమవంతుఁడో కనులారఁ గాంచుము. అని పుంఖానుపుంఖములుగా నమ్ములఁజిమ్మినాఁడు. పూలమాలికలై సీతాసతి గంఠము నలంకరించు చున్నవి. పంక్తికంధరుఁడు వినోదముగా నాయుధముల విడుచుచున్నాడు మహాశక్తి రామునియం దైక్యమయినది. రాముఁడు శరసంధాన మొనర్చినాఁడు. లోకములు, గడ గడ వడఁకినవి, దేవతలు జయజయ ధ్వానములు గావించుచున్నారు. రామబాణము రావణాసురుని పదితలలను కుత్తుకలంట నరికి యశోకవనమున సీతముందరఁబడ వేసి, యాయమ్మ, తిరిగి రామునియం దైక్యమయినది.

రాముఁడు సముత్తీర్ణప్రతిజ్ఞుఁడయినాఁడు. విభీషణపట్టాభిషేక సమయము వచ్చినది. యా మహాభక్తుడు జానకిని పుష్పకముపై నెక్కించి, రామునిసన్నిధికిఁ జేర్చినాఁడు. యామహాసాధ్వి రాముని మనోదార్ఢ్యము ప్రకటింపఁదలఁచినది. సహజశరీర సంపదకు మెఱుగుసేయు, మైపూఁత, అభినవ పుష్పదామములు ఘ్రాణతర్పణమగు సువా

స్తనలు పిసాళింపఁ బూచిన తంగేడు వలె, రావణ వధానంద సంజనిత పరమానంద సుధాపాన మత్తచిత్తుఁడగు రాముని సన్నిధానము చేరినది. ఘోరచూపుల చూచు రాముని గనుసన్నఁ జేసినది. శ్రీరాముఁడు గ్రహియించినాఁడు. విభీషణుఁడు, మారుతి, సీతను పరికించినారు. మనస్సు భ్రమచెందినది. యథార్థము గ్రహింపలేక కళవళపడినారు. అనసూయా దత్తమగు పవిత్రాంగరాగ ప్రభావమెఱిగియు సీతా మాయాజాలమునకు మునిగి పరాకుఁజెందినారు సీతయందు విపరీతాభి ప్రాయపడినారు. పతివియోగమున సాధ్వికి శరీరాలంకారము, దూష్యమని తలంచి, రాముని వంకఁ జూచినారు. యథార్థమెఱిఁగియు, మాయానాటక మాడి చఁదలచి రామచంద్రుఁ డనుమానపడినట్లు నటించి, శత్రుమందిరమునఁ జిరకాలము వంటరిగ నివసించిన సుందరిని పరిగ్రహించు విషయము చర్చలోనికి దిగినారు. విభీషణాదులు నిరుత్తరులయి తలలువంచుకొని చాటయినారు. లక్ష్మణుని పిలుపించి మీవదినెగారినిఁ బరికించమని యాజ్ఞ నొసఁగినాఁడు. సౌమిత్రి ప్రికృత్తైపథ్యము చూడలేక మగుడయి, చితి పేర్పించి, రాముని కెరింగించినాఁడు. రాముఁడు సీతను కనులారఁ జూడకయే, సపరివారుడయి చితిని సమీపించినాఁడు. పంటవలంతి కొమరితయు స్వశరీర పరిగ్రహణమునకువ్విళ్ళూరుచుఁ బెండ్లికిఁ బోవునట్లు సంతోషముతో నగ్నిగుండమును సమీపించి, రాముని వలగొని, సాష్టాంగనమస్కార మొనరించి చితిలోఁ బ్రవేశించినది. కనుకట్టు జరిగినది. చూచువార లాహాకార మొనరించుచున్నారు. మాటలలో మాయసీత, మాయమైనది. ఆకాశమంతయు విమానములతో నిండిపోయినది, వేలుపు తుటుముల పూలజల్లు యిలాతలమంత నిండినది. అగ్నిహోత్రుఁడు విస్ఫులింగములు వెదజల్లుచున్నాఁడు వేదిస్మరులతోఁగూడి శాఖా మృగంబులు కనులనీరు గార్చుచుండెరి. రామలక్ష్మణులు పర్వత భావము వహించి స్థాణ్వాకృతులయినారు. మెరపుమెరసినట్లయినది. దేవవనితలు సిబికారోహయగు భూకుమారిని వైశ్వానరరాశినుండి తీసికొనివచ్చి రామునిముందర నిలిపినారు. జయజయ ధ్వనులతో మింటనుండి యపాంసులా శిరోమణి సీతామతల్లి సాధ్వి సాధ్వి యను

శుభవాదములు దిగంతముల వ్యాపించినవి. సర్వాభరణ భూషితు రాలగు సీత స్వశరీర ధారిణియై ముసిముసి నవ్వులు నవ్వుకొనుచు, సిగ్గు నభినయించుచు, పైట సవరించుకొని రామచంద్రుని పాదములకు నమస్కరించినది. విమానారూఢుడగు దశరథ నరేంద్రుఁడు దేవేంద్రునితో సమీపించుచుండఁగా నారదుం డరుదెంచి, సీతారాములకు నమస్కరించి, సాధ్వీమతల్లీ! దేవేంద్రుఁడు, నీ మామగారితో నిన్ను సేవించుట కరుదెంచినాఁడు. యమభటుల కడగండ్ల పారఁదోలినందుకు, నీకు పసదనంబు లొసఁగవచ్చినాఁడని వినయముగా వినుపించ రామునితోఁగూడ, మామగారిని దేవేంద్రుని సేవించినది. రామచంద్రా! సీతకు పరీక్షయా! అనసూయాంగరాగమహిమ, నిన్నీ మహాపరాధము సేయించినది సుమా! యనెను. పంక్తిరథుం డా దంపతులఁ జూచి, సంతసించుచు, ఆహా! సాధ్వీ, నావంశము పవిత్రమయినది. రామా! నీ సత్యప్రతిజ్ఞుఁడవయినావు. సాకేతపురంబున కేఁగి, భిషేకముఁ జేసికొమ్మని యాజ్ఞనిచ్చి దేవతలతోఁగూడ నాకంబున కేఁగిరి. అగ్నిదేవుఁడు నమస్కరించి యాతల్లి దేహసంస్పర్శచే నేను తరించితిని, దయయుంచుమని ప్రార్థించి యంతర్ధానమయ్యె. విభీషణ పట్టాభిషేకానంతరము, పుష్పకారూఢులైన సమస్తసేనాపరివృతుఁడై రాముఁడు సాకేతపురి కరుదెంచినాఁడు. పురజను లానంద పూరితులయినారు. భరతశత్రుఘ్ను లెదురుగావచ్చి గొప్ప యుత్సవముతో పట్టణమంతయు దిరిగి కోటలోఁ బ్రవేశించినారు. రాముఁడు తల్లుల దర్శన మాచరించి, వారి యనుమతంబున వసిష్ఠ ప్రేరితుండయి వంశీయముగ, సింగపు గద్దియ నెక్కి సర్వజన నయనాహ్లాదంబుగా దేవతలు కుసుమాసారంబు గురియింప పట్టాభిషేకము జరిగినది. వసిష్ఠాదుల గౌరవించినారు. ప్రజలానందసముద్రమున మునిగినారు. సీత రామునివంకఁ జూచినది. కౌసలేయుఁ డా భావము గ్రహియించినాఁడు. ఆంజనేయుని యొడినుండి పాదములు తీసినాఁడు. మారుతి జానకియొద్ద నిలువఁబడినాఁడు. ఆ తల్లి మెడనుండి ముత్యాలహారము తీసి నాకు ప్రాణదానము చేసిన నీకింతకంటె నెక్కుడు పసదనమీయఁ జాలనని, పవనసూతి మెడలో వైచినది. నమస్కార పూర్వకముగా

వాయునందనుఁ డిట్లు పలికె. తల్లీ! మహాశక్తివి, మూలప్రకృతివి, నన్నీ మాయాజాలమున ముంచక సంసారార్ణవము దాటిపోవు భాగ్యము నా కొసంగుమని ప్రార్థించఁగా, నా మహాయోగిని, కుమారా! నీయభీష్టము నెరవేర్చెద యిటురమ్మని, చేరఁదీసి, మహావాక్యోపదేశ మొనరించి ధన్యునిగావించినది. పట్టాభిషేకము సమాప్తమయినది. ప్రజానురంజకముగా, రాముఁడు సీతా సహాయమునఁ బదివేల వత్సరములు రాజ్యపరిపాలన మాచరించి ధర్మవృక్షముఁ జక్కఁగా వృద్ధిఁజేసి, కుశలవులను కుమారులనుగాంచి, వారికి రాజ్యపట్టాభిషేకముజేసి పతివ్రతా ప్రభావము జగంతిముల వ్యాపింపఁ జేయుచు నిరంతర పతిశుశ్రూషాపరాయణ యగు ధరాకుమారితో గూడ రాముఁడు వైకుంఠమున కరిగినాఁడు. సీతాదేవి శతకంధరాది దనుజవర్గమును దునుమాడ పలుమారు భూలోకమున నవతరించి మర్త్యలోకమునకు సమస్త శుభములు సమకూర్చి శాశ్వతైశ్వర్యము లొసంగుచు పాతివ్రత్య మహిమల వెదఁజల్లుచు, భక్తుల గాపాడుచు వారి యభీష్టముల నిరంతరాయముగా నెరవేర్చుచుండును. ఆమహాశక్తి యనుగ్రహమున భరతదేశపు స్త్రీ రత్నము లమూల్యమగు పాతివ్రత్య ధర్మ మనుసరింతురుగాత!

---

# సు క న్య.

---

మున్ను శర్యాతి యను ధరావల్లభుండు రాజనీతి ననుసరించి ధర్మమార్గము దప్పకుండ భూమండలము పరిపాలించుచు, పెక్కు ధర్మములఁ జేయుచు సప్తసంతానములం బేర్కొనిన తటాకాది ప్రతిష్ఠల నాచరించుచు కాలము గడుపుచుండెను. పెక్కువత్సరములు గడిచినను, పున్నామ నరకమును దాటించఁగలిగిన సంతానము లేమికి, వగలంబొగలుచు నీశ్వరారాధన మాచరించి పెద్దల దీవనలంది పరమేశ్వరానుగ్రహంబున నొక పుత్రిక పడసెను. యా

బాలికామణికి నా నరేంద్రుఁడు సుకన్య యను నామకరణముఁ జేసి మిక్కిలి ప్రేమతోఁ బెంచుచుండెను. ఆచిన్నది దినదినప్రవర్ధమానయై వళక్షపక్షచంద్రునివలె పరిపూర్ణకళానిలయమై యలరారుచుండె సార్థకనామయగు యాసుకన్య సకలకలాపరిపూర్ణయగుచు చదువుల సరస్వతి, చుట్టాల సురభి, యాకులలోఁ బిందె, తలలోని నాల్క యని సాటివారలు కొనియాడుచుండ యల్లారుముద్దుగాఁ బెరుగుచుండె.

శర్యాతి మహారాజు సింహాసనముపై గొలువుండి, నటవిట గాయకాదులచేతను, వారాంగనాభినయములచేతను, నాటక శ్రవణాదులచేతను, పండితుల సిద్ధాంతపూర్వపక్ష చమత్కారముల చేతను, కవీశ్వరుల రచనావిశేష విలోకనాదులచేతను, వ్యాయామ పరిశ్రమా వినోదములచేతను, సమరవ్యూహా నిర్మాణపక్షుల పరీ క్షాదులచేతను, పురాణ శ్రవణానందములతోడను కాలము గడుపు చుండఁ గొంద ఱాటవికులగు బోయలు పుట్టతేనె, పులిజున్ను, మత్తేభకుంభనిర్గళితములగు నాణిముత్తియములు, వెదురుబియ్యము, కస్తూరి మొదలగు పదార్థములు పారిబర్హికములుగా గైకొని రాజ సందర్శన మాచరించి యిట్లు విన్నవించిరి. ఓరాజా! నీపరిపాలనంబున మే మేయీతిబాధల నెఱుఁగక యింతవరకు గాలిలో ముల్లు నాట కుండ, సిగలో పూవు వాడకుండ, పాడిపంటలతో దులదూగుచు బిడ్డలు, పాపలు, మేము సురక్షితముగ నున్నాము. సామీ! యిది యేమిచిత్రమో యిప్పుడు చెవుమెకంబులు చెలరేగి మాపల్లియలు విడిదిగాఁ జేసికొని, మా పంటపైరులు పాడుచేయుటేగాక మా కుటుంబముల రూపు మాపుచున్నవి. మమ్ములఁ గాపాడు మహా ప్రభువు నీవు. కావున, దాము దయచేసి మాయాపదలఁదీర్చి కాపాడకున్న మాప్రాణములనిచ్చట విడిచెదమని యేడువసాగిరి. శర్యాతి యాటవికుల దీనాలాపములాలించి, జాలివహించి, బోయ లారా! విచారపడకుడు. మేము వేటకాండ్రతోఁగూడ నడవుల కరు దెంచి, మీ యాపదలఁ దొలగింతుమని వారి కభయమొసంగి, వేటకై తగినపరివారము సిద్ధపఱుపుమని మంత్రుల కాజ్ఞనొసఁగి శుద్ధాంతమున కీవార్త నెఱుఁగింపనెంచి సభను చాలించి చనియె.

శర్యాతి ధరావల్లభుండు, పరిపూర్ణోత్సాహసన్నాహ మృగయావాహినీ సమేతుండై పుటభేదనంబు, నిర్గమించి, సుకన్యయు నంతఃపుర కాంతలు దాసదాసీజనంబులు, తక్కినబందుగులు తోడరా దుర్గమారణ్యముల మృగయావినోదార్థము ప్రవేశించె. వలలు, బోనులు, ఉరిత్రాండులు, బాకీటలు, ఈండేలుబద్దలు, జిగురుకండెను, వేటకుక్కలు, డేగలు మొదలగు వేటకుపయోగించు పరికరములు గైకొని, తమతమపరాక్రమముల వెల్లడించుకొనుచు భిల్లులు భూతకాంతునిసమ్మోహించి తేని య్యానతిగొని, కొమ్ములనూదుచుం డప్పుల వాయించుచు, పొదలనున్న దుష్టమృగంబుల వెలికిందోలుచు, యడివిదున్నలు, కొమ్ముకాండ్లు మొదలగు చెడుమెకంబుల దునుమాడుచు, యేదుపందులు, చిఱుతపులులులోనుగాంగల, దుష్టమృగంబులంజీల్చిచెండాడుచు, వేటగాండ్రు క్షణకాలములో భీకరారణ్యము భీభత్సముగా రక్తప్రవాహముల ముంచివేసిరి. మఱియు నడుగుల జాడలంబరికించి దట్టముగానల్లుకొనియున్న పొదలలోడాగు సింహ శరభ శార్దూల వనవరాహాది నానాక్రూరమృగ సంతానముల రూపుమాపి, శర్యాతి పెద్దయుం బ్రొద్దు రౌద్రరసమూర్తియయి ప్రళయకాలరుద్రునివలె నా యరణ్యానిని వీరవిహారముసలిపి, యపక్రాంత దుష్టసత్వముగాం గావించెను. అంతట నొక్కసరోవరతీరంబున నిర్మించిన పటకుటీరమున సఖురాండ్రతోఁగూడియున్న సుకన్య మహారణ్యమందలి వినోదములు గాంగొన మిక్కిలి యుత్సాహముతోం జూచుచు, సృష్టిచమత్కారముల కానందించుచు దిరుగాడుచుండె. ఇంతలో నిలారమణు డాగుడారము ప్రవేశించి మృగయావిహారోచిత నైపథ్యముం దొలంగించి, వనసంచార పరిశ్రమా వినోదార్థము జలకేళియందు వేడుకకలిగి యంతఃపుర కాంతారత్నములతో జల్లులాడి పటగృహంబున విశ్రమించెను.

సుకన్య, చెలికత్తియలతో సరోవరప్రాంతభూముల విహరించుచు లతాడోలికల నుయ్యేలలూగుచుం జీవ్రుగు జొంపముల డాగుచు పట్టు తివాచులవలె మృదువయిన లేతపచ్చికబయళ్ళ విశ్రమించుచు, రకరకముల తావులు నలుదెసలం బిసాళించు పువ్వులంగోసి, నయనా

నందముగాను, రచనానైపుణ్య ప్రదర్శనానుకూలముగాను విచిత్ర తరంబుగ పూలదండలు కట్టుచు తెల్లదామరలపైనుండి వచ్చు పిల్ల గాలులను సేవించుచు, పరిహాసోక్తుల సఖురాండ్రనానందింపజేయుచు, వినోదముగాఁ గాలముగడిపి, యానందరసప్రవాహమున నీదులాడుచు నానమయమున దనమనంబునఁ దోచిన యభిప్రాయములఁ బద్య రూపముగా నల్లి సఖురాండ్రకు వినుపించుచుండు నంతలో, సూర్యుఁడు పశ్చిమ ధరాగ్రమలంకరించెను. పశ్చిమ దిగంగనాంతఃపురమున కరుదెంచు ప్రభాకర మహారాజ పరిచారకులు, పరాకులు దెలుపుచు స్తోత్రపాఠములు సలుపుచున్నవా యనునట్లు, పిట్టలు, తమ గూండ్ల కేఁగుచు, పసిగుడ్డులఁ గాంచుభాగ్య మీపూటకు మాకు లభించు చున్నదిగదాయని సంతోషముతో పలువిధములగు ధ్వనులు సేయ సాగినవి. వరుణాశాకాంత కైసేయఁ గుంకుమ చందనంబు మైనిండ నలందినదియా యనునట్లు సాంధ్యరాగము నలుదెసల ముసురుకొని యెను. వారుణీభాస్కర సమాగమసమయమున సంతోషముతో వేలుపులు, ముత్యపుసేసలు జల్లిరా యనినట్లు మింట చుక్కలు వెలు వడసాగినవి. సఖీజనంబులతో సుకన్య గుడారమునకుఁ బయన మయ్యెను. మార్గమధ్యమున విచిత్రతరంబగు పుట్ట యొక్కటిగాంచి సమీపించి యా వల్మీకమును పరిశోధించుచుండ నందలి రంధ్రముల యందు కురువిందమణులవలె, ఖద్యోతములవలె మెఱయు రెండు వింతవస్తువుల గనుగొని, యచ్చెరువందుచుఁ బాల్యచాపల్యంబునఁ దనచేతనున్న కంటకంబున నావస్తువులఁ గుల్లగించెను. వెంటనే యాపుట్టనుండి రక్తము పైకి నెగఁజిమ్మెను. సుకన్య భీతచేతస్క యయినది. సఖురాండ్రు బెగడుపడినారు. రక్తప్రవాహము మిక్కుట మయినది. గుండెలు దడదడ కొట్టుకొనసాగినవి. ఇతికర్తవ్యతా మూఢులయినారు. గుడారములకుఁ జేరినారు. ఈ యుదంతము వెలిబుచ్చలేదు.

ఆ వల్మీకమున చిరకాలమునుండి చ్యవనుఁడను శాపా యుధుండు తపంబు సలుపుచుండె. నిర్వికారుండయి తపోనిష్ఠచే నుండిన కతంబున నామహర్షి శరీరంబునఁ బుట్టలు పెట్టినవి.

సూర్యునియందు దృష్టి నిలిపియుండుటచేఁ గాఁబోలు నా వల్మీక రంధ్రములయం దా మహర్షి నేత్రములు కురువింద పూసలవలె గాను పించుటచేతనే భూపాల పుత్రిక మెఱుగుడుపువ్వులని భ్రమపడి పొడిచి నది. కర్మానుభవ మెవ్వారికిఁ దప్పిపోదుగద! నిర్వికల్పసమాధినుండి కొంతవడికిఁ బ్రబోధమంది, బాహ్యదృష్టికిఁ గనుబడు పదార్థములు గనుబడక, ప్రపంచ మంధకారబంధురమై కనుపట్ట, నేత్రదృష్టి తగ్గినదని యనుమానపడి, యాకస్మికముగా నిట్టి విపరీత మేల గలిగినదియో యని దివ్యదృష్టిని పరిశీలించెను. యోగాభ్యాస ములచే మహాపురుషుల శరీరములు పాషాణప్రాయములుగదా? పరమాత్మయందు స్థిరచిత్తముచే లీనమయినవారికి, దేహమునకుఁగల సుఖదుఃఖములు తెలిసికొనఁజాలరు. దేహాభిమానము కలిగినపుడే శీతోష్ణాదులు, క్షుత్పిపాసాదులు, దేహికిఁ గలుగును. కావున నా మహాయోగి తనకుఁ గలిగిన నేత్రావరోధమున కాశర్యాతి తనూజాత కారణముగా దివ్యదృష్టిచే నెఱింగి బిట్టలుకచే భూపాలునిబలంబు లన్నియు మూత్రపురీషనిర్బంధముచే బాధనొందునట్లు శాపంబొసంగె. ఎంతటిశాంతునకైనను దేహతాపము కోపముపుట్టింపకమానదుగదా? ఆక్షణముననే శర్యాతి భూపాలుని సైన్యమంతయు, మలమూత్రము వెలువడక యమితమగు పరితాపమందుచుండె. యొకరియవస్థ యొకరు సెప్పుకొనసాగిరి. అంతకంతకు బాధ యెక్కుడయ్యెను. ఆబాల గోపాల మల్లాడుచుండిరి. తురంగ మాతంగాదులుకూడ ననిర్వాచ నీయమగు బాధనొందుచుఁ గనులవెంట జలజల బాష్పబిందువులు విడు వసాగినవి. శుద్ధ కాంతాజనంబులు మనోవైకల్యము కలిగి, విపరీత భావముచేఁ గలహాంకూరము లచ్చటచ్చట, మొలకలెత్త సాగినవి. పిశాచములు పట్టినవారివలె గంతులు వేయసాగిరి. శర్యాతి మనో ధైర్యము జారిపోయినది. మంత్రివర్గముతోఁగూడ నకస్మాత్తుగా నిట్లు జరుగుటకు కారణ మారయుచుండె. అప్పుడు సుకన్య యీ యల్ల కల్లోలము గాంచినది. తానొనర్చిన యపరాధ మీ విధముగాఁ బరిణ మించినదని తెలిసికొని తండ్రి సమీపమున కరుదెంచి యిట్లనియె. తండ్రీ! ప్రకృతిచిత్రములఁ గాంచుచు, నీ కాననమునఁ దిరుగాడుచు

నీసమీపముననున్న యొక పుట్టమీఁద నెవ్వియో కురువింద పూసల వలె మెఱయుచుండ, వానికాంతి కచ్చెరువందుచు వానినిఁ దీసికొన వలయునని, ముంటిచేఁ బెల్లగించితిని. అంతనా, నాకువనుండి రక్తము చిమ్మి వెల్లువయయినది. యా రక్తమును జూచినప్పటినుండియు, నేలకో, నాచిత్తము వ్యాకులపాటు చెందినది. సాధ్వసము లెన్నాడు చున్నది. నాహృదయము చెయ్యివెట్టికలచినట్టు వికారమునందుచున్నది మన ప్రజలకీ యాకస్మికముగాఁ గలిగిన మహావ్యాధి కదియే కారణ మేమో యని నాకు భయమగుచున్నది. పరిశీలనా దక్షులగు మన ప్రకృతివర్గము, మీరు నా యపరాధ మెంతదనుక వ్యాపించనున్నదో విచారింపుడని మనవిచేసినది. పాదములకు నమస్కరించినది. కనుల నుండి నీరు వెల్లువగాఁ గారఁజొచ్చె. శర్యాతి భూకాంతుఁడా సుకన్య పలుకుల నాలకించి, యథార్థముఁ దెలిసికొనఁదలఁచి, మంత్రివర్గ ముతోడ నా వల్మీకము మిగుల జాగరూకతతోఁ ద్రవ్వించెను. అందు తపోనిష్ఠాగరిష్ఠుఁడయి యపరభానునివలెఁ బ్రకాశించు చ్యావ వాలుని చూచి, యద్రమూర్తివలె నుండుటచే భయము, వింత, అబ్బురము మనంబున ముప్పిరిగొనఁ దనకూఁతు రా ఋషికొనర్చిన యపరాధమునకు దిగులుపడుచు, తనసేనకుఁ గలిగిన దురవస్థ కీనేరమే కారణమని నిశ్చయించుకొని, మంత్రివర్గముతోఁ గూడ నా సంయ మీశ్వరునకు సాష్టాంగ నమస్కార మొనర్చి వినయవిధేయతలు రూపుదాల్చినటుల నాతఁడు, దనసేనకుఁ గలిగిన దురవస్థ బాపు మనియు, సుకన్య యజ్ఞానమునఁ జేసిన యపరాధము సహించుమనియు, నా ప్రజలను కాపాడి, మీచిత్తమువచ్చిన శిక్ష నాకొసంగమనియు, ప్రజ లల్లాడుచుండ సుఖపడు రాజు తరాజు, ఎలికరాజు, క్షీబరాజు గాని మానవమాత్రుఁడు గాడనియు, నీయపరాధము మన్నించనిచో నీదేహము తమ పాదములకు సమర్పించుట యథార్థమనియు వేడు కొనియెను. తపోధనులేగదా శాంతధనులు. వారికి దీర్ఘకోప ముండదు. తాత్కాలికమైనను, యీర్ష్యాసూయాగ్రస్తము కాదు. శాంతధనుల తామసము ప్రజలకు మహోపకారము. పురాణ జ్వర పీడితులగువారికి వైద్యుడు పెట్టువాత యప్పుడు భయము, బాధ

కలిగించినను, రోగనివారణ కారణముకాని శిక్షావిధానము కాదు. అటులనే, యపరాధ మొనర్చినవారియెడ మహాత్ము లొసంగు శాపములు పరమోపకారములుగాని, కోపసంజనిత భీతిదాయకములు కావు. అంత దీనానుఁడై వేడుకొను భూపాలుని వాక్యములకుఁ జాలిపడి, తనకుఁ గలిగిన నేత్రావరోధము కర్మవశమని యెఱింగి తన కోపము మహాప్రసాదముగా మార్చుకొని, రాజా! నాకు నేత్రములు లేకపోవుట నా నిత్యకర్మానుష్ఠానమునకుఁ బ్రతిబంధకము. ఆ ప్రతిబంధమునకు నీకుమార్తె కారణము. దురభిమానము పెంపున నా కన్నులఁ బొడిచిన పాపమునకుం బ్రాయశ్చిత్తముగ నీ కన్నియను నా కొసంగి వివాహము సేయుము. నన్ను సర్వదా సేవించుచు, నా నిత్యానుష్ఠానమునకు నభ్యంతరము లేకుండ కాలము గడుపుచుండిన మీ సేనలకు మీ ప్రజలకు నేవిధమయిన కష్టము లుండవు. నీయాపద తీరును. అని చ్యవనుండు పలికినతోడనే శర్యాతిభూపతి గుండె జల్లు మన్నది. మిన్నువిరిగి మీఁదఁబడినట్లయినది. గుండెలలో దడ జనియించినది. పుత్ర పుత్రికాప్రేమ యెట్టి యుదుమలనైన లోబడఁ జేయును. ఇంచుక ధైర్యము వహించినాఁడు. ఆ మానిచంద్రుని పాదములమీఁదఁ బడినాఁడు. స్వామీ యజ్ఞానకృత్య దోషమున కింత శిక్షయా! యీ (యజ్ఞానురాలు) అబల, ముద్దరాలు, మూఁడుమాటల కారుతప్పులు. ఉత్తగోల. యీ యరణ్యరోదనమును గట్టుకొనిన మీ గృహస్థాశ్రమ ధర్మమును తామెట్లు నెరవేర్తురు. తమకు సర్వదా సర్వోపచారములు సలుపుటకు దాస దాసీజనం బొసంగెద. తమకొక గ్రామం బొసంగెద. సకలవిద్యా వయోవిలాసాదుల మనోవికాసములఁ గల్పింపఁదగిన కన్యారత్నములఁ బరిణయం బొనరించెద. క్షమించి యపరాధమును మన్నింపుడనిన, నా శాపాయుధుఁడు శర్యాతిభూపతిఁగాంచి, ఓరాజా, మాకు వృధా కాలక్షేపము సేయకు. మా శరీరమందే మా కభిమానము లేక, శాసనమునఁ గాపురము సేయు మాకు గ్రామము లెందుకు? దాస దాసీజనంబు లెందుకు? నీ యిష్టమువచ్చిన మా యభిప్రాయము ననుకరించుము. లేనిచో మాతపోనిష్ఠకు భంగము కలుగును. మాట

లచేఁ గాలయాపన సేయక చనుమని యించుక తిరస్కారముగాఁ బలుకు నాసంయమినిఁ గాంచి, శర్యాతి భయపడి, శతవృద్ధునకు నీ బంగారుబొమ్మ నెట్లిత్తును? యీ చెట్లక్రింద నాకుమార్తె కాపుర మెట్లుసేయును? యీ బడుగు మునివలనఁ బడు సౌఖ్యమేమి? చేతి మీఁదుగఁ బెంచిన రామచిలుకను గండుపిల్లికి విందుసేయ నెంచినట్లు ఎంతయో గారాబునఁ బెంచిన సుకన్యను ముదుసలి చ్యవనున కర్పించవలయునా? వయసా నూరువత్సరములు. ధనధాన్యములా గగన కుసుమములు. సౌందర్యాదులా శశవిషాణములు. గృహారామాదులా రావిపువ్వులు. యేమిచూచుకొని, సుకన్య సౌఖ్యపడును. అసూర్యం పశ్యయగు సుకన్య నేఁటికి పర్ణశాలలో కాపురమా? ఆహా దైవమా! స్వర్గమునుండి యొక్కసారిగా శర్యాతిని, నరకమునకుఁ బడఁ ద్రోచితివే. యేది యెటులయినను నా సైన్యమును, నా ప్రజను కాపాడుటకన్న నాకుఁ గర్తవ్యము లేదు. ప్రకృతము చ్యవనుని మనోభీష్టము నెరవేర్పకున్నచో, క్రోధం బున మరల నెట్టి శాపం బొసంగునో? ఎట్టయిన మౌనిచంద్రుని కోరిక నెరవేర్చుట నాకుఁ బరమకర్తవ్యము. చేచేతుల సుకన్య నీ బడుగు చీకున కీఁజాలను. ఈయకున్న నాప్రజలబాధల నెట్లుమాన్పఁ జాలుదును. అని ధరారమణుఁడు, వితర్కించుచుండ, నీ వార్త చెలి కత్తియలచే విని సుకన్య తండ్రిపాలి కరుదెంచి, తండ్రీ! వృత్తాంత మంతయు నాలకించితిని. నే నపరాధిని. మహర్షి దయానిధి గావున క్షమించినాఁడు. యీయాఁడుపుట్టువు పరునియింట నుండఁదగినది కాని, తలిదండ్రుల నింటనుండు భాగ్యము లేదుగదా! తమకుఁ దగిన పాత్ర దొరికినదిగాన, శీఘ్రముగా నన్ను దానమొసంగుడు. పెనిమిటితో పేదరికము. వానతో సేగియు, కలదా? తపోధనులు, సృష్టికిఁ బ్రతి సృష్టిసేయు సామర్థ్యము కలవారు. నేనొనర్చిన యపరాధమునకు, మేరకలదా? ఆకలములు గాలిని మాత్రమే దిని, శరీరము మట్టిచేఁ గప్పుకొని సామాధినిష్ఠనుండు వానిగ్రుడ్లు కుళ్లగించిన యపరాధ మునకుఁ దగిన శిక్ష. రాజపుత్రాన, నీవే నా కొసంగవలయు. జనకా! సూక్ష్మదృష్టిచే విచారింపుము. తన కపకారము చేసిన నీచురాలినే

యర్ధాంగిగా వరింపఁగోరిన ఋషిపుంగవు దయాదాక్షిణ్యము లెంతని కొనియాడుదును. బిడ్డలకన్న నెక్కుడుగ మనకడ నుండు ప్రజల బాధలఁ దొలగించుటకంటె, మనకుఁ గావలసిన కార్య మేమున్నది? ఈశరీరము చర్మము దిగదీసి చెప్పుల కర్పించినను వారి ఋణము నీగఁజాలము. ఆలస్యముసేయక యా మహాభాగుని కోరిక నెరవేర్చి సైనికులబాధఁ దొలగింపుడు. అని, ధైర్యముగా ప్రజా రక్షణకై ముందంజవేయు కొమరిత సుగుణసంపత్తి కచ్చెరువందుచు మహా వైభవంబునఁ నా మౌనిపుంగవునకుఁ దన తనయనిచ్చి వివాహము గావించెను. ప్రజలబాధ లుడిగిపోయినవి. వారందఱు సుకన్యాచ్యవనుల కృపాగుణ మభినందించుచు సాష్టాంగ నమస్కార మాచరించిరి. సుకన్యామణి తలిదండ్రులు బాలికామణిని విడువలేక సమస్తాభరణముల తోను వలయునంత పరిచారికా గణము, హారణముగా విడువఁజూచు తలిదండ్రులఁ గనుగొని సుకన్య పెనిమిటి కడనుండి నారవలువఁ గైకొని ధరించి, సమస్తాభరణములు పరిత్యజించి సతీధర్మపరాయణయై జననీజనకులారా! మీయింట సకల సౌఖ్యముల ననుభవించఁదగిన కాలముఁ దీరిపోయినది. నాప్రారబ్ధము పరిపాకదశ నొందినది. ఈ శరీరము నాథుని యధీనమయినది. మేము నివసించునది వనప్రాంతము. కిరాత దుష్టమృగ భూయిష్టము. ఈ ధనపురాసులు, నగలు దాచుకొనుటకు మాకు గృహములా! మేడలా! పెట్టెలా! బేడలా? ఈ పరిచారిక లెందుకు. శుద్ధఖాందసులగు మహర్షులు వీరిసేవ లంగీకరింతురా! భర్తృసేవాపరతంత్రనగు నాకు వీరొనర్చు యుపచార మేమి యుండదు. కావున సపరివారముగ మీ పురంబునకుం జనుఁడని బ్రతిమాలి వారినిఁ బంపి సుకన్య భర్తృసేవాపరాయణురాలై కాలము గడుపుచుండె. ఆ సాధ్వీరత్నము పెనిమిటికన్న మున్ను మేలుకాంచి, గృహకృత్యంబులఁ దీర్చుకొని సుస్నాతయై పసుపు కుంకుమ దాల్చి చిరునవ్వు చిందులాడు మోముతో భగవన్నామ మాచరించు భర్తృపాదములు సేవించుచు భర్తను నిద్రనుండి మేల్కొలిపి యతిభక్తితో నిత్యకృత్యములగు సమస్తోపచారము లొనర్చి, యవగాహనాదులఁ గావించి పద్మాసనా

సేనుగాఁ జేసి, పూజాద్రవ్యాదుల సిద్ధముజేసి, వన్యధాన్యములు సిద్ధముఁజేసి, వంటకముగావించి, యతిథులు వచ్చిన నాదరించి భోజన మజ్జనాదుల నాథున కేలాటి లోపము రాకుండ కంటికి రెప్ప వలెఁ గాపాడుచుఁ దలలోని నాల్కవలె మెలంగుచు, సాఁటి ముని కాంతలలో సమస్తధర్మములచేతను వన్నెకెక్కి కీర్తిలతల లోకమున వ్యాపింపఁజేసినది. చ్యవనుఁడు తన భార్యయొనర్చు పరిచారమువలన తన నేత్రావరోధమును మరచిపోయి దివ్యజ్ఞానముచే లోకాలోకములు సూచుచు, గృహస్థాశ్రమ ధర్మములఁ జక్కఁగా నెరవేర్చుకొనుచు నప్పుడప్పుడు తనమనంబున.

"సీ॥ సకలార్థసస్యాలి । శ్లాఘ్యమై ఫలియింప
భార్యయే బలమైన । పంటభూమి
కమనీయ గార్హస్థ్య । కాసారవాటికి
భార్యయే ముదము నా । పట్టు హంసి
దీర్ఘమా రోగాంధ । దీర్ఘిక న్పడకుండ
భార్యయే దిట్టమా । పట్టుకొమ్మ
విపులమా విపదబ్ధి । వీడఁబడి పోకుండ
భార్యయే దరిని జూ । పట్టునావ

కరముశుభముల సమకూర్చు । కల్పవల్లి
శాశ్వతైశ్వర్యరమకు వి । శ్రాంతపదవి
స్థిరతరానందకీర్తికి । దివ్యగృహము
సర్వవిధముల భార్యయే । సరస సరణి."

అని దలచుచు నానందమునఁ గాలము గడపుచుండె. సుకన్యయు నప్పుడప్పుడు నాథుని యానతిఁగొని కందమూలములు, పూజాద్రవ్యములు, వంటకట్టియలు సంపాదింప ఘోరారణ్యము ప్రవేశించి పతిభక్తి సహాయముగా నప్పుడప్పుడు, దుష్టమృగంబుల బారినుండి తప్పించుకొనుచుండును. యాసాధ్వి నివసించు భీకరారణ్యమునఁ బిల్ల యేనికలు, సింహపుపిల్లలు కలిసి యాడుకొనుచుండును. మూషక మార్జాలములు, పులులు లేడులు, పాములు నెమళ్లు, శరభములు

సింహములు, యొక్కరేవున నీరు ద్రావును. యొక్కదిక్కునఁ బండు కొనును. సూర్యుడు యథేచ్ఛగా నాసతి నివసించు పర్ణశాల నెండఁ గాయ వెరచుచుండును. వాయుదేవుఁ డా పతివ్రత యవయవముల నుండి వస్త్రము తొలగునేమోయని గట్టిగా వీచుట మానుకొనును. సకల ఋతువులు సుకన్యా పాతివ్రత్య ప్రభావమువలన సర్వకాల ములయందు ఆ యాలువ పర్ణశాలా భూరుహంబుల సేవించుచు మూఁడుపువ్వు లారుకాయలనునట్లు ముద్దులు మూటఁగట్టుచు చ్యవ నాశ్రమము భూలోకస్వర్గమా, యనునట్లు సకలశోభాసమాసాదిత రమామందిరమై యలరారుచుండె. మఱియు చ్యవనుం డామెను నప్పు డప్పుడు యోగవిద్య నభ్యసింపఁజేయుచు, నధ్యాత్మబోధ సలుపు చుండుటచేత నానందపరవశయై యైహికసుఖాపేక్ష నీచముగాఁ దలంచుటయేకాదు, యా భ్రాంతియు మరిచిపోయినది. ప్రకృతి సౌఖ్యము సృష్టియందు కలదా లేదా యను సంశయ మాయమ్మకు లేనేలేదు. జగన్మిథ్యబ్రహసత్యమను మహావాక్యసార మామె మూర్తీభవింపఁ జేసికొనినది. ఇట్టు లాదంపతులు కాలము గడుపు చుండ, దేవేంద్ర సభామధ్యమున నోషధీప్రభావ పరీక్షా సమయము ఒక్కమారు సంభవించినది. ఓషధీక్రియా సాధనలు స్త్రీపురుషాదుల స్వాధీనముఁ జేయుటకు సమర్థములా, యసమర్థములా, యను చర్చ ప్రారంభమయినది. సిద్ధాంతరాద్ధాంతములు పలువిధములుగా బయలు దేరినవి. పతివ్రతలచెంతను, మూర్తిత్రయముచెంతను, క్రియా సామ ర్థ్యము పనికిరాదని యందఱు చేతులెత్తిరి. కాని, యశ్వినేయులు మాత్రము మే మనుభవపూర్వకముగాఁ బరిశీలనఁ జేయనిది యేకీభ వించమనిరి. అప్పుడు నారదుఁడు మీ రాసిద్ధాంతము క్రియారూప మున జూపింపఁదలఁచిన, నిప్పుడు చ్యవనుని యిల్లాలు; శర్యాతి కూతురు. సుకన్యను మీరు స్వాధీనముజేసికొని యా యంశము స్థిరీకరించుడు. ప్రకృత మా యిల్లాలు పాతివ్రత్యమున శక్తిత్రయ మును మించిన నవీన ప్రపంచ నిర్మాణమునకు సమర్థురాలు. మీక్రియా సామర్థ్య మెంతదనుక వ్యాపింపఁగలదో యోషధుల బల సామర్థ్యము లెంత పరిమాణము కలవియో భూలోకమున వెల్లడింపు

డన, వల్లెయని యశ్వనీదేవతలు సుకన్యా సాధ్వీ వ్రతభంగమునకై భూలోకము ప్రవేశించిరి. నారదుడు వేల్పువెజ్జులు భూలోకమున మనుజజన్మనెత్తుకాలము సమీపించినదని, నెమిలి కుంచెవిప్పి గంతులు వేయసాగెను. దేవతావైద్యులు ఓషధీసారముల గ్రహించినారు. దేవేంద్ర సభామధ్యమునఁ బల్కిన ప్రతిన సాధింపఁ దలఁచినారు. చక్కనివారలోఁ బ్రసిద్ధినిగాంచితిమను గర్వము చూపులనుండి వెదజల్లుచు చ్యవనాశ్రమము బ్రవేశించినారు. సుకన్యామణి సమిత్కుశాదుల సేకరించుకొని, మోపుకట్టుకొని సిరసుపై నిడుకొని, పర్ణశాలకు ప్రయాణమైనది. భిషగ్వరులు సమీపించినారు. సాధ్వీముఖసందర్శనమయినది. హృదయమున నేమో భీతికలిగినది. ఇది భావియశుభసూచకముగాఁ దలంచినారు. ఓషధీసామర్థ్యముల స్మరణకుఁ దెచ్చుకొన్నారు. నిలుకడఁగాంచిన తటిల్లతవలెఁ గనులు మిఱుమిట్లుగొలుపు దేహకాంతులు నలుకెలకుల వ్యాపింపఁజేయు సుకన్యను సమీపించినారు. పలుకరించుటకు సాహసించినారు. కాని, నాలుక వెనుకాడినది. శరీరము కంపమొందినది. పదస్తంభనక్రియాచూర్ణము మార్గమునఁ జల్లినారు. యామందుగాలి సుకన్యయడుగులకు సోకినది. నడక మందగించినది. యమరవైద్యులు సమీపించి, తొలిపలుకునకే నీవు నీవని, లోలోనఁ దొక్కిసలాడి, వనితామణీ! యీ యాశ్రమ మెవ్వరిది? నీ వే గృహమేధి నిశాంతము పవిత్రము చేయుచున్నావు. ఈ భీకరారణ్య సంచారమేల? రాచకన్యవలెనున్నావే! యీ మోపు స్వయముగా మోయఁదగిన యవసర మేమి యని, యిరువురు వయిద్యులు సుకన్యా యోగక్షేమాదుల నారయుచు నడువసాగిరి. చ్యవనుని యిల్లాలు తనపాదములకు గమనశక్తి మందమయినదని తెలిసికొనలేదు. అతిథులు తమ కుటీరము చేరఁబోవుచున్నారని మనంబున సంతసించుచుఁ దనవృత్తాంతము సాంతముగావచియించి మహానుశ్లాఘ్యులారా! తమరు భూలోకమున విహరింపఁ జనుదెంచిన, యనిమిషులవలె నున్నారు. మాయింటికి దయచేసి మాగృహము పావనము సేయుఁడని, సవినయయై పలుకుచుఁ దన యడుగులు దడబడుచు నడక సాగమికి లోన వగచుచు భర్తృపాదసేవాకాలము

సమీపించుచున్నదే యని మనమునఁ జింతనొందుచు నడువ నారం భించినది. వేల్పువెజ్జులు, సమ్మోహన క్రియాప్రభావ పరిశీలనార్థము గాలిలో నాచెట్టువేరు త్రిప్పినారు. యాగాలి సుకన్యాశరీరమునఁ బారినది. వేల్పుబాజుగుకాండ్రు మందసంచారులై నీ వృత్తాంతము మాకు మిక్కిలి విషాదకారణమయినది. పండువంటి ప్రాయము పాడుచేసికొని, యీ బడుగు చీకుమానితో నేమి సౌఖ్య మనుభ వింపఁదలఁచితివి. తారుణ్యము ఝరీవేగము. క్షణములమీద మారి పోవును. పోయినప్రాయము మరల వచ్చునా? చ్యవనుఁడు ముక్కోపి యని త్రిభువనములయందు పేరు మోసినవాఁడు. ఛాందసుఁడు. వయసు చెల్లినవాఁడు. అంధుఁడు. బొమికల బొమ్మ. సర్వదా శీతాతపంబుల నుండుటచేత శరీరము కర్కశము వహించి యుండును. పర్ణకుటీరము, తృణశయ్య, నారబట్టలు, దుంపలు, పండ్లు, గడ్డి బియ్యము వీని సారమేగద శరీరపోషణ. వ్రతములు, ఉపవాసములు, చాంద్రాయణ దీక్షలు, యేమి పుణ్యముచేసి యీ కాపురము సంపా దించినావు. కామినీ నీయందము, నీసోయగము నీ లేబ్రాయము సిరిసంపత్తులతోఁ దులదూగు మహారాజ కుమారులతోడనో, దేవతా సమూహములతోడనో క్రీడించఁదగిన సుకుమారివి. యెట్టి బెట్టిదపు టిక్కట్టులకు లోనుగావలసె. దైవవిధి తప్పదు. అట్లని నిరాశ చెందఁ గూడదు. యీవేరు నీవద్దనుంచుము. కోరినకోరికలు చేకూరును. దేవేంద్రుడు నీకు పాదసేవకుఁడగును. నీవు మహారాణివి కాగలవు. నీకోరికలు నీలో నశింపఁజేయకుము నిన్నుఁజూచినవేళ యెట్టిదియో గాని నీ వృత్తాంతము వినినతోడనే మాకుఁ జాలి గలిగినది. అడవి గాచిన వెన్నెలవలె నీ ప్రాయము, బుద్ధికుశలత, నీ శరీర సౌష్టవము వ్యర్థమగుచున్నదని విచారముచేఁ బలుకుచుంటిమని మఱియు నేమియో ముచ్చటించ బ్రయత్నించు నాశ్వినేయులఁగాంచి, సుకన్య యిట్లు వచియించె. దయాశాలులారా! తమ దయాకా రము పరికించిన దివ్యులని తలంచుచున్నాను. మీ మాటలు శ్రవణపుటంబుల వ్రక్కలించుచున్నవి. నామనస్సు పరీక్షింపఁ దలఁచి యిట్లు పలుకుచుంటిరి. కాని లేనిచో మీ నోటినుండి

రాఁదగిన మాటలాయివి. శరీరమన జీర్ణించునది యనిగదా యర్థము. మనుజజన్మ దుర్లభము. నియమశీలము లేనిచో పశువుకన్నహీనము. నాయనలారా! యీ యార్యావర్తభూమి భారతవంశీయులకీర్తి సంప దలచే నలరారు దివ్యదేశము. స్త్రీల పాతివ్రత్య రత్నశలాకదీప్తులచే ముల్లోకములవారిని గుడ్డిగాఁజేయు దివ్యక్షేత్రము. ఈ పుణ్యభూమి గాలి సోకినతోడనే యెట్టి నీచాభిప్రాయము గలవారైనను, సదభిప్రాయులంగా మారిపోవలయునే. మీరేల నిట్లసభ్యములగు మాటలాడుచున్నారోఁ దెలిసికొనఁజాల కున్నాను. మీరు నన్ను కఠినపరీక్షల నలుపకుడు. స్త్రీలకు భర్త యెటువంటివాఁడైనను దైవముతో సమానముగాఁ జూడవలయు. పతి వ్రతకు భర్తృ పాదసేవయే ముంగొంగు పసిడిమూట. వృద్ధుఁడుగాని, దరిద్రుఁడుగాని, స్త్రీలకు పెనిమిటి దేవుడు. మగని సేవించిన మగు వకు ముమ్మూర్తులు వడంకుదురు. బిడ్డలారా! నేను మీకుఁ దల్లిని. పుత్రులు తల్లులకు నిట్టిమాటలు చెప్పవచ్చునా? రండు మాగృహంబు నకు. సంధ్యాసమయము సమీపించుచున్నదని తొందరగ నడువ నుంకించినది. గాని పాదములు తూలికాశలాకలవలె వ్రేలఁబడినవి. సమ్మోహన క్రియాసామర్థ్యము గాఁబోలు ప్రపంచమంతయు సౌందర్య రాశి యయినది. దస్రులు చిరునవ్వు నవ్వుచు భయము నటించుచు నామెను స్వాధీనము చేసికొన నెన్నియో ప్రయత్నములు చేసిరి కాని వ్యర్థఫలులయిరి. సుకన్య వీరిచర్యలు కనిపెట్టినది. తానేల శీఘ్రముగా నడువఁజాలదో విచారించినది. దివ్యుల మాయాప్రభావమని గుర్తించి నది. భర్తను మానసమునఁ దలంచుకొన్నది. సంధ్యాసమయమునఁ జేయదగిన పరిచర్యలు స్మరణకు దెచ్చుకొన్నది. దేవవైద్యులఁ గోర చూపులు చూచినది. ధర్మదేవతకు నమస్కార మాచరించినది. శీఘ్రగమనము ప్రారంభించినది. క్రియాప్రభావ మంతరించినది. అమరాగదలంకారులు విభ్రాంతి పడినారు. ప్రపంచము తారు మారుగాఁ దోఁచినది. ఓషధీక్రియాప్రభావములు సాధ్వులకడఁ బని సేయవని నిశ్చయించినారు. సుకన్య మహాశక్తిగా మారినది. అశ్వి నేయుల శరీరములు ప్రకంపన మందినవి. ధైర్యబీజములు దిగజారి

నవి. అనన్యగతికులై సుకన్యా శరణాగతియే రక్షకమనుకొన్నారు. ఆ పతివ్రత పాదములకు నమస్కరించినారు. సుకన్య తన పర్ణశాలఁ జేరినది. పెనిమిటికి మ్రొక్కినది. యస్రుల కాతిథ్య మొసఁగినది. అనిమిషభిషగ్వరులు చ్యవనునకు నమస్కరించినారు. తల్లీ! నీ పతివ్రతా మహాత్మ్య మమేయమని స్తోత్రమొనర్చినారు. దేవవైద్య చూడామణులు చ్యవనునికి నేత్రముల నివ్వఁదలచినారు. స్వామీ! యపరాధమును మన్నించమనినారు. సుకన్యానుమతంబున సమీప జలాశయంబున కా తపోధనుని తీసికొనిపోయి, యావైద్యులతోఁ గూడ కోనేట మునిగినారు. దివ్యసుందరాకారులై మూగురొక్క రూపున వెలువడినారు. సాధ్వి సుకన్య తనభర్తను గుర్తిఁడజాలక పోయినది. దేవతావరుల నాభర్తను జూపించమని ప్రార్థించినది. సాధ్వి మామువ్వురిలో నీ యిష్టమువచ్చినవానిని పతిగా గ్రహించి సుఖించు మనిరి. యా దివ్యసుందరాకారులు దీపమునఁ బుట్టిన దీపములవలె సమాన వయోరూపలావణ్యాదుల నభేదము కలిగియున్నారు. అనన్య గతికమైనది. యీశ్వరుని ప్రార్థించినది మనసార పెనిమిటెని దలచి నది. ఓ సుందరాకారులారా! మీ యిష్టమువచ్చినవారు నా పాణిని గ్రహియింపుడు. వానిని భర్తగా గ్రహియించెదనని దృఢముగాఁ బలికినది. పతివ్రతను సమీపించుటకు దేవవైద్యులు ప్రయత్నించిరి కాని యా మహాశక్తి శరీరమునుండి వెలువడు దివ్యదీప్తులు వేల్పు వెజ్జులదూరముగా నెట్టివేసినవి. వారువారి క్రియాసామర్థ్యములుసుకన్య ముందు నిష్ఫలములయినవి. సూర్యపుత్రు లిరువురు నిశ్చేష్టు లయి నారు. చ్యవనుఁడు నిర్భయముగా సమీపించినాడు. సుకన్యా పాణిగ్రహణ మొనరించినాఁడు. బడబాతనూజులు బొమ్మలవలె నిలువపడినారు. చ్యవనుఁడు తనసతీ సతీధర్మమునకు సంతసించి సుర వైద్యులఁ గరుణించమని యాన నొసఁగినాఁడు. సాధ్వి సుకన్య కను గిరిపినంతకాలములో సృష్టి మార్చివేసినది. నారదుఁడు చనుదెంచి నాఁడు తల్లీ! యాయుర్వేదము నుద్ధరింపుమని పాదములపై బడినాఁడు. నేత్రావరోధము లేక దివ్యసుందరరూపుడైన పతిని చేకొనిన నూతన కళ్యాణసమయమున దేవవైద్యుల యపరాధమును మన్నించమనిన,

నారదునికి సుకన్య నమస్కరించినది. చర్షుల నారదునకు నమస్కరించుడని యాజ్ఞాపించినది. దేవవైద్యులు సిగ్గుపడినారు. నీప్రభావము దెలియక చేసిన యపరాధమునకుఁ దగిన శిక్ష నొసగుఁడని ప్రార్థించినారు. శర్యాతి కూతురు మనుజభామినిఁ గోరిన కతంబున రాఁబోవు ద్వాపరంబున మనుజజన్మమెత్తి భూలోకంబున మనుష్యాంగనయందు సంతానము వడసి, పూర్వరూపము గ్రహింతురుగాక యని శాసించినది. ఆ శాపముననే నకులసహదేవులుగాఁ గుంతికి జనించినారు. తెరగంటి వెజ్జులు నూతనమగు రసాయన మొందు సిద్ధముచేసి చ్యవనుని శరీర దార్ఢ్యసంపత్తికి నొసంగినారు. చ్యవనుఁడు భుజించి వజ్రశరీరుఁ డయినాఁడు. యా యౌషధమునకు చ్యవనప్రాసమని నామకరణము చేసినారు. దేవఋషి యశ్వనీదేవతలకు దేవేంద్రుఁడు సోమపానము నీయక తిరస్కరించినాఁడు. కావున, స్వామీ! వీరిని సోమపానార్హులగా యాగములయందు నియమించవలయునని, చ్యవనునితోఁ బల్కినాఁడు. చ్యవనుఁడు నాకు వారొనర్చిన దేహారోగ్యోపకారమునకుఁ బ్రత్యుపకారముగా, నశ్వినీదేవతలకు శాశ్వతముగా యజ్ఞములయందు సోమ మిచ్చెదనని వాగ్దానము చేసినాఁడు. వాడబేయులతోఁగూడఁ గలహాశనుండు త్రిదివంబు సేరినాడు. సుకన్యా చ్యవనులు సకలభోగము లనుభవించుచు సుఖంబుగా నుండిరి. శర్యాతి యొకనాఁడు కుమార్తె వృత్తాంత మారయఁ గోరి చ్యవనాశ్రమమున కేతెంచెను. సుకన్యా చ్యవనులు నమస్కరించిరి. సగౌరవముగాఁ బూజించిరి. చ్యవనుని రూపము మారిపోయినసంగతి శర్యాతి యెఱుగడు. కావున, సుకన్యను కోపముతోఁ బుట్టినయింటికి మచ్చదెచ్చితివా? భృగువంశపు మర్యాదఁగూడ బుగ్గిగావించితివా? యా మహర్షి నేమిచేసితివి? ఇంక నీ ముఖముచూడనని పరుషముగా మాటలాడు శర్యాతినిఁజూచి, చ్యవనుఁడు నవ్వుచు తన వృత్తాంతము సుకన్యా పాతివ్రత్య మహిమయు సవిస్తరముగా బోధపరచెను. రాజచంద్రుఁ డామాటలు విని దన యజ్ఞానమునకు లజ్జించి, కొమరితను మన్నించమని యదుగుకొని దంపతుల ననేకవిధములగు గౌరవములతోఁ దన పురంబునకుఁ దీసి

కొనిపోయి పార్వతీ పరమేశ్వరులవలెఁ బూజించుచు, నా తపోధనుని
యధ్వర్యునిగాఁగొని, తనకుఁ బుత్రసంతానము లేనికొరంతఁ దీరుటకు
దివ్యసవనమొందు ప్రారంభించెను. చ్యవనుఁడు, దేవతాహ్వానము,
ప్రారంభించినాఁడు. మంత్రాకర్షణచే వేల్పుల నాకర్షించినాఁడు.
సభామధ్యమున ఋషిబృందము నిండియున్నారు. సోమయాగము
ప్రారంభించినారు. దేవేంద్రుఁడు వచ్చినాఁడు. వైద్యులు, పంక్తి
బాహ్యులు. మాబంతికి పనికిరారు. సోమపానమున కనర్హులు. వీరి
నాహ్వానించిన యాగము భ్రష్టమగును. మేమిచ్చట నిలువము. అని
తిరస్కారముగా నధ్వర్యునితోఁ జర్చ ప్రారంభించినాఁడు. చ్యవనుడు
సాదరముగా వైద్యులనుగూడ గౌరవించవలయుననియు, నౌషధం
బుల జేయుటయందుఁ గలుగు దోషములు నివర్తించుటకుఁ బ్రాయ
శ్చిత్తములు కలవు. గావున, నేనీ దేవతావైద్యులకు, సోమభాగ
మీయఁ దలఁచితినని గంభీరోపన్యాసమొసఁగి శాస్త్రార్థమొనర్చి
యచ్చటి పండితుల మెప్పించి, యమర భిషగ్వరులఁ బంతినిఁ
గూర్చుండఁబెట్టినారు. దేవేంద్రుఁడు త్రేతాగ్నులఁ జల్లార్చినాఁడు.
సుకన్యామణి వచ్చినది. భర్తకు నమస్కరించినది. పితృవంశము నిలు
పుటకై యీ యాగముఁ బూర్తిచేయుడని మహేంద్రునిఁ
బ్రార్థించినది. వినలేదు. లేచిపోవ యత్నించినాఁడు. చ్యవనుఁడు
మంత్రాక్షతలు చల్లినాఁడు. త్రిదశేశ్వరుఁడు చిత్రాకృతిగా
నిలువఁబడినాఁడు. శర్యాతికూతురు వీతిహోత్రుని ప్రార్థించినది.
జిహ్వాసప్తకముతోఁ బ్రత్యక్షమయినాఁడు. యాగహోమములు సాగు
చున్నవి. శచీకాంతుఁడు తెల్లబోయినాఁడు. వజ్రాయుధ మెత్తినాఁడు
సుకన్యమీఁదికి. ఆ సాధ్వీమణి చిరునవ్వు మోమున మొసలెత్తగా
నరుణేక్షణముల శైలపక్షచ్ఛేదిని చూచినది. చెయ్యి బిగిసిపోయినది.
వ్యర్థప్రయత్నుఁడైనాఁడు. మొగమునఁ గత్తివాటువేసిన నెత్తురు
లేదు. చ్యవనుడు సోమపానమున కాన యిచ్చినాఁడు. దేవేంద్రు
డంగీకరించలేదు. భార్గవుఁడు ప్రేషయిచ్చినాఁడు. యింద్రుని సోమ
చమసపాత్ర స్వయముగా బయలుదేరి మహేంద్రుని నోటికంటు
కొనినది. సభాసదులు నివ్వెఱపడినారు. శ్రీమహావిష్ణువు యాగపరి

సమాప్తియందు యజనపాయసము శర్యాతి కొసంగినాఁడు. సభాసదులు భార్గవుని శక్తి కచ్చెరువందుచు, కరతాడనంబు లొనర్చినాఁరు. దీక్షా పరిసమాప్తి స్నాన సంకల్ప మయినది. ఇంద్రుఁడు చిన్నపోయినాఁడు, తలవంచినాఁడు. సోమరసము గొంతునఁబ్రవేశించినది. నోటినుండి సోమపాత్రఁ దీయఁదలఁచినాఁడు. యూడిపడలేదు. తలవంచి చ్యవనునకు నమస్కరించినాఁడు. సోమపాత్రయథాస్థానము చేరినది. బిగిసిపోయిన భుజముమాత్రము స్వాధీనము కాలేదు. సుకన్యకు మస్తకమువంచి నమస్కరించినాడు. భుజము స్వాధీనమయినది. సుకన్యా పాతివ్రత్యము నభినందించుచు దంపతులకు ముమ్మారు వలఁగొని సాష్టాంగ నమస్కారముచేసి వారియాజ్ఞగొని, స్వర్గలోకము చేరినాఁడు. అశ్వనీదేవతులు తమకునూతనముగా లభించిన సోమపానమునకు సంతసించుచు చ్యవనదంపతులకు నమస్కరించి పతివ్రతచే దీవించఁబడి నాకమున కరిగినారు. యజనపాయసము భక్షించి శర్యాతి భార్య గర్భవతియై సుగుణఖనియగు కుమారునిఁ గనియె. చ్యవనుడా సతీతిలకముతోఁ గాలముఁ గడుపుచు, పుత్రపుత్రికా సంతానము వడిసి, సాటివారలలో కీర్తిగాంచి వానప్రస్థపదవిలో నుండి, భార్యయు, భర్తయు పరమాత్మయందు లీనమయిరి. వారిచరిత్ర శ్రవణయోగ్యమై యలరారుచుండెను. సుకన్యామణిని స్మరించిన సమస్తమంగళములు చేకూరుగావుత.

## సావిత్రి.

శ్రీనికేతనమున మహావైభవముతోఁదులదూగు సాళ్వదేశాధిపతి శత్రువులచే నోడింపఁబడి, యడవులయందు నివసించుచుండెను. యా భూపాలునకు చిత్రాశ్వుడను పుత్త్రుఁడు కలడు. ఆతడు రూపమున మన్మథుని, బుద్ధి కుశలతచే బృహస్పతిని, సత్యముచే, ధర్మదేవతను, బలమున వాయుదేవుని, పరాక్రమమున శంకరుని లక్ష్యము సేయక సుగుణముల ఖనియని పేరుమోసి తలిదండ్రులగు, ద్యుమత్సేన

దీనవత్సలలను సకలోపచారములచే సంతుష్టులఁ జేయుచు బాల్యముననే, సత్యవంతుఁడను సార్థకనామధేయుఁడై, యడవులఁ బెరుగుచు, ధనుర్వేదమును సాంగోపాంగముగా నభ్యసించుచుండెను. మద్రభూపాలుండు సంతానములేక, తనభార్యయగు మాళవితోఁగూడ వనంబులకేఁగి, తపోధనుల యనుగ్రహమున, సావిత్రీ మంత్రోపదేశమంది, సకలాభీష్ట ప్రదాయినియగు, సావిత్రీదేవిని, పరాశక్తిని స్థిరచిత్తుఁడై చిరకాల ముపాసించెను. సావిత్రి ప్రత్యక్షమై, రాజా! నా యనుగ్రహంబున నీకొక పుత్రికారత్నము కలుగును. యీ చిన్నది, నీవంశము నుద్ధరింపఁగలదు. నీవు ప్రజలఁ గాపాడుచు సుఖంబుండుమని దీవించి యంతర్ధాన మందెను. కొన్ని దినంబులకు మాళవి గర్భవతియై నెలలు నిండినపిమ్మట నొక శుభసమయంబున, దివ్యలక్షణ లక్షితయగు, బాలికామణిం గనియెను సావిత్రీదేవి యనుగ్రహంబునఁ గలిగిన యీ చిన్నదానికి, సావిత్రి యను నామకరణంబు గావించి, యేటఁబెంచు పెంపొక్క-పూటఁ బెంచుచు మిక్కిలి యనురాగముతో సర్వదా యామె ముద్దుమురిపెములు చూచుకొనుచు నాదంపతులు కాలముగడుపుచుండిరి. ఆ కన్యారత్నము బంగారుబొమ్మవలె, చూచువారల మనం బాకర్షించు దినక్రమంబున శుక్లపక్ష చంద్రునివలెఁ బెరుగుచుండెను. ఆ రాజునకుఁ బుత్రసంతానము లేని కతంబున, నీమెకే రాజ్యమొసఁగఁ దలఁచి రాజ్యపరిపాలోచిత విద్యాభ్యాసము చేయించెను. వరప్రసాదిని యగుటచే సమస్త విద్యాపారంగతురాలయినది. విలువిద్యయందు, మిగుల ప్రసిద్ధిగాంచినది. సంప్రాప్తయౌవన యయినది. సావిత్రి గుణగణంబులకు మాతాపితరులేగాక, దేశప్రజలందఱు ముచ్చటల నుతియించుచుండిరి. సావిత్రి తండ్రి యశ్వపతి, యామెను తగిన వరున కీయఁదలంచి వరాన్వేషణము సేయుచుండెను. ఇట్లు కొంతకాలము గడిచినపిమ్మట నశ్వపతి మృగయావినోదము కొఱకు, మంత్రివర్గముతో శుద్ధాంతజనంబుతోఁ దగినపరివారము సేకరించుకొని, వేటకుందగిన నైపథ్యముతో భీకరారణ్యంబు ప్రవేశించి, దుష్టమృగంబులఁ జీల్చి చెండాడుచుండెను. సావిత్రియు, జనకునకు సహాయురాలుగా నిర్భయముగా శబ్దభేది మొదలగు శరసం

ధానముల యందు దారితేరి యందివేసిన చేయియై, తండ్రికంటె మిగుల నేర్పరి యని వేటకాండ్రు సంతోషించుచుండఁ గొంతవడి మృగయా ఖేలన మొనర్చి, యొక్క కురంగపోతము వెంబడించి, యొక ఋష్యాశ్రమము చేరెను. మృగయా పరిశ్రమాపనోదార్థము, మనోహర మగు, కమలాకరముచెంత సుగంధ పూరితములగు, పిల్లగాలుల గ్రోలుచు నొక్క గున్నమామిడిచెంత విశ్రమించెను.

తలిదండ్రుల సేవించుచుఁ దమ రాజ్యచ్యుతికి విచారించుచు, దైవయోగమునకు వగచుచు, సమిత్తులను, వన్యఫలములను సేకరించు కొనుటకై, మూపున గండ్రగొడ్డలి, చేతనొక త్రాడు, ఖననసాధకములు వెలుంగ, సత్యవంతుఁడు సమీపారణ్యమున దిరుగుచు, నా కోనేటియొడ్డున నొక్క మోడిన జమ్మిచెట్టునుచూచి, దాని పుల్లలు నిత్యము తమ యగ్నికార్యాదుల కుపయోగించునని తలంచి, యా వృక్షమును సమీపించెను. దైవఘటన చిత్రముగదా! సత్యవంతుఁడు వృక్షంబునెక్కి మోడినకొమ్మ మొదలు గొట్ట నుంకించి గొడ్డంటితో నరుకుచు నష్టరాజ్యుఁడు కావున శత్రువుల దలంచుకొని తనమనంబున నిట్లు తలపోయసాగె.

తెగవా వైరుల కంఠనాళములు ధా ♦ త్రీజాతశాఖా విభాతి
తిగ గొట్టంగను రాముఁడొకఁడే ♦ తీండ్రి శౌర్యాగ్నిచే
తగదా కాల్చను వైరిరాడ్వనముల్ ♦ తద్ధర్మమేపూని వై
రిగరాణ్మంగళదేవతాకరము వారిం ♦ జేర్చి ముద్దాడెదన్.

సావిత్రి కా కంఠధ్వని, చెవులలో నమృతము పోసినట్లయినది. నలువంకల పరికించినది. శమీ వృక్షాగ్రమున దివ్య తేజము గాంచినది. హృదయంబున విభ్రమము, సంతోషము, అనురాగము, నవీనప్రేమ, అమూల్యమగు విశ్వాసము, యేమేమో నూతన ప్రపంచ మొకటి యావిర్భవించినది. సావిత్రి రిచ్చవడినది. మనంబునఁ గోరికలు సెలయేళ్లవలె ప్రవహింపసాగినవి. శ్రవణరంధ్రము లా శ్రావ్యగానము తిరిగి వినవలెనని తొందరనొందుచున్నవి. నేత్రములా నవీనాకార సౌష్టవ పరిశీలనా కార్యప్రవాహము తలమునకలై యాడులాడుచు, నూపిరి విడువకుండఁ బనిసేయుచున్నవి. వేయు

మాటలేల సావిత్రీదేవి ప్రతియవయవము సత్యవంతుని సందర్శనమున, వేళసత్కరీ న్యాయముగాఁ బూర్వరూపము విడిచిపెట్టి నవీనావతారముఁ దాల్చినది. సావిత్రి యేకాంతసేవ, నవీనానురాగవాత్యాచక్రమున సుడివడి, యెట్టకేలకు విశ్రమస్థలమునకుఁ జేరి, భావి కర్తవ్య నిరూపణ సిద్ధాంత మెటుల నోనర్ప గలనా యని తలపోయ సాగినది.

సత్యవంతుఁడు యెండుపుల్లలు మోపుగట్టినాఁడు. ఖనిత్రము చేఁబూని యేవియో దుంపలు త్రవ్వుచున్నాఁడు. పాదమున ముల్లొకటి నాటినది. దానిని తీసి యెదుటఁబెట్టినాఁడు. ఓయి కంటకమా! నీయభిమాన ధను కోలుపోయినావ్రసుమా! నా పాదమును పొడిచితి నను కొంటివి కాఁబోలు. సమీపించిన నీ వినాశనమును దెలిసికొనలేక పోయితివి. శుద్ధజడపదార్థమైతివిగదా! యిదిగో చితాగ్నిస్వాఁడు నీరూపు మాపుచున్నాఁడని కాలఁబెట్టి నేలరాచి యా చూర్ణము మేనఁబూసికొని, మదీయ రాజ్యలక్ష్మి యటాకుల హృదయరక్తములమైపూతపూసికొని, ప్రేవుల కంఠమాలల ధరించి, శత్రుమస్తకంబుల హస్తంబున నాడించుచు, దేశరక్షణార్థము కిరాతపాణివాతూలముల కాలభుజంగమువలె నెగచిల్చి నీరసింహాసన మధిరోహించు భాగ్య మీ చితాగ్నిస్వాఁడు చూచునా చూడడా యని, శిరోకేశముల మెలివేసికొని, ప్రత్యక్ష నరసింహునివలె, మహేంద్ర నీలరుచుల నలరారు శిరోజముల నెగదువ్వకొను, కొన్నిదుంపలపెకలించి మూటఁగట్టకొని, పయనమగుచుండె.

సావిత్రీదేవియు, వీర రసపూరితమగు సత్యవంతుని రూపము చూచి క్షాత్రరక్తమునకుఁ గల వేడిమియు, తేజము, గౌరవయు, విద్యుచ్ఛక్తులవలె ప్రకాశించుచు, తన మనమును శరీరమునుగూడ స్వాధీన మొనర్చుకొనుపాటి సామర్థ్యము కలవని సిద్ధాంతము చేసికొనినది. చంద్రకిరణ ప్రసారము కమలినీలతా స్వరూపము నేల స్వాధీనము చేసికొనలేదు. సావిత్రీ శరీరమందలి క్షాత్రరక్తము కూడ వేడిమిచేతఁ బొంగి ప్రతిఘటించిన యమునినైన నిలువఁబెట్టి కార్యము సాధింపగల సామర్థ్యము గలదియై, నేత్రప్రసారములచే సత్యవంతుని

చినచో పెనిమిటిని విడుచుట భారతదేశీయాచారమా? శాస్త్రీయమా? ధర్మమా? గౌరవమా? ఈవిషయము నేనేల చర్చింపవలె? మీర లుభయులు, వరికిఁ పని ధర్మములున్నవా? యని సావిత్రి కొంచెము లజ్జను ప్రకటించుచు ప్రత్యుత్తరమిచ్చెను. దేవఋషి యామె స్థిరచిత్తమునకు మిగుల సంతసమునందుచు రాజచంద్రమా! పులి కడుపున చలిచీమ జనియించునా, నీకంటె మనోదార్ఢ్యమునందు నీ కూతురు వేయిమడుంగులెక్కుడు. యీసంబంధమున నాకు దెలిసినదంతయు చెప్పకతప్పదు. వారియు నీ సత్యవంతునకు పూర్ణమగు "ఆయువు" లేదు. అల్పాయుర్దాయనంతుడు. దాపురమెందుకు? వివాహమయిన వత్సరమునకంటె జీవించుట కష్టతరము. అని నారదుఁడు వచియించుచుండగనే అశ్వపతి పిడుగుపడినట్లుమూర్ఛనొందె. సావిత్రియు, స్థబ్ధభావమందినదిగాని ధైర్యముమాత్రము విడువలేదు. భగవంతునిమీద భారము వైచినది. పాతివ్రత్య మహిమ పరీక్షింపనిశ్చయించినది. తండ్రికిఁ ప్రబోధ మొనర్చినది. తండ్రిలేచి సావిత్రిని కౌగలించుకొనినాడు. తల్లీ! నారదుని వాక్యము వింటివిగదా. పట్టువిడిచిపెట్టుము. దరిద్రుండైనను నేను వలదనను. నా సర్వస్వమునకు నీవే యధికారురాలవుగదా! నీ సౌఖ్యమునకు కొదువయుండదు. వైధవ్యదుఃఖము సహింపఁజాలవు. తెలిసియుండియు దుఃఖాబ్ధిలో మునుగవచ్చునా యని పలువిధములు, తండ్రియు, నారదుఁడు, బోధించినారు. సావిత్రి మానస మయోమయ మయినది. ఇంచుకంతయు చలించలేదు. కర్మగతి దప్పకొనుటకు, సాధ్యమా! కాదు, వలచి వరించుకొనిన వానితో క్షణకాలసౌఖ్య మనుభవించినను, జన్మాంతము సౌఖ్య మనుభవించినట్లె. మనసు వరించనివానితో, నూరేండ్లు సౌఖ్య మనుభవించినను దుఃఖమే. వరించిన సత్యవంతుని వీడను. లేదా బ్రహ్మచారిణినై తపోనియమాదులచే శరీరము త్యజించెద. ఇంక మీ యిష్టము. అని యూరకుండిన, నారదుఁడు రాజా! యీమెచిత్తము పాషాణప్రాయ మయినది. ఈమె పాతివ్రత్యముచేత, తన సౌభాగ్యము కాపాడుకొనునేమో? పతివ్రత కసాధ్యమగు కార్య ముండదు. ఈమెకొక మంత్రోపదేశము చేసెద. ఆ మంత్రోపాసనచేత దేవతా

దర్శన మగును. అమ్మా! సావిత్రీ యిటురమ్ము. అని, సావిత్రీ మంత్రోపదేశము గావించి దీర్ఘ సుమంగళీభవ యని, దీవించి, సావిత్రీ! మంత్రము ప్రతిదినము విడువక జపించుచుండు మని, భర్తతోపాటు అత్తమామల సేవ యొనర్చుచుండు మని బోధించి, నారాయణనామస్మరణ గావించుచు, త్రిదివంబునకుం జనియె. అశ్వపతియు సపరివారుండయి, వివాహ సంభారములం జేకూర్చుకొని, ద్యుమత్సేనాశ్రమము సమీపించి, సత్యవంతుని పరిణయవిషయము ప్రసంగించి, యెట్టకేలకు వానిని యొప్పించి, తగువైభవముతో సావిత్రీ సత్యవంతులకు వివాహ మొనరించి, యత్తవారింట సతులు మెలంగవలసిన ధర్మముల నెల్ల బోధించి యశ్వపతి తన గృహంబున కేగెను. సావిత్రియు సర్వదా భర్తసేవాపరాయణురాలై, యత్తమామలకు తలలోని నాల్కయై వివాహ దినమునుండియు, తన విభుని యాయుఃప్రమాణంబు దిన దినము లెక్కించుకొనుచు, మరణమాసన్న మగుటచే లోలోపలనే కృశించుచు నుండెను. అణుమాత్ర మయిన తన మనోవిచారము వెలువడ నీయలేదు. సత్యవంతుని యనురాగప్రవాహము సావిత్రీ ద్వీపమును ముంచివైచినది. అన్యోన్యానురాగములు యెనుకకోలు మహోత్సవముల నందుచున్నవి. సావిత్రి మానసధైర్యము మేరుపర్వతమును డీకొనినది. మూండుదినములు మాత్రమే సత్యవంతుని జీవితము. నారదుని నియమప్రకారము సావిత్రీ పూజ సలుపుచు, త్రిరాత్రోపవాసవ్రతదీక్ష నారంభించెను. జలములనైన గ్రోలక కఠినదీక్ష వహించినది భర్తృపదసేవయు, అత్తమామల సేవయు కొఱతవడకుండ సేయుచు, వ్రతదీక్ష జరుపుకొనుచు గృహకృత్యములు నెరవేర్చుకొనుచుండెను. ఇంత కఠినదీక్ష వహింపనేల యని యత్తమామలు పలుమారడిగినను సావకాశముగ వచింతుననియు, నారదోపదిష్టవ్రతపరిసమాప్తి దివసమనియు వచియించుచు సమిత్కుశఫలాదులకై యడవికేగు సత్యవంతునితో తానుగూడ వత్తునని పట్టుపట్టి యా గండపుదినమున దాను వెంబడించినది. కాననమునందు ప్రకృతిచిత్రములం జూచినారు. సాయంసమయము కావచ్చినది. వలసినన్ని పుష్పఫలాదులను సేక

రించినారు. మోదుగచెట్టు మొండుది యొండు కనుపడినది. దానిని వంటకట్టియలకుం గొట్టుట ప్రారంభించినాడు. మృత్యుసమయ మాసన్నమయినది. యీదివసము నాలుగుజాములు గడచినవిగదా యింక నలుజాములు గడువవా యని ధైర్యము వహించినది. సత్యవంతునికి ఆకు యముండు స్వయముగా బయలుదేరినాడు. మృత్యువు జేనెడమగా చిత్రాశ్వని శిరసుపై నాడంజొచ్చినది. శిరస్తోదము ప్రారంభమయినది. శరీరము వేడిచేనుటకు ప్రారంభించినది. మైమరపు ప్రారంభమయినది. తల దిరుగుచున్నదని గొడ్డలి క్రింద పారవైచి నాడు. దేహమంతయు చెమటలు దిగంబోసినవి వేయి వృశ్చికము లొక్కమాటు కుట్టినట్లు పరితాప మందుచున్నాడు. నిలువలేక పడం బోవు నాథుని పట్టుకొని తన తొడ యుపధానముగా సత్యవంతుని శిరంబు మోపి పైటచెరగున విసరుచు భగవన్నామ ముచ్చరించుచు, భీతచేతస్కయై దిగులుపడి పెనిమిటి శరీరస్థితి పరికించినది. పెనిమిటిజీవితాశ వదలినది. సత్యవంతుని శరీరముక్షణమున కొకతీరుగా మారిపోయినది నాలుక లాగుకొనిపోయినది. గ్రుడ్లు పైకియుబికినవి. నిశ్వాసవాయువులు ఘోరముగా వెలువడసాగినవి. కఫము గొంతుక లోపల ఘుర్ఘుర ధ్వనిం జేయుచున్నది. దేహస్మృతి పూర్తిగాం బోయి నది. పిడుగుపడినట్లు సావిత్రిమూర్ఛిల్లినది. కాలకింకరులతో మహిష వాహనా రూఢుడయి యమధర్మరాజుగారు సమీపించినారు. దివ్య తేజోమూర్తియగుసత్యవంతునింజూచినాడు. విస్మయము చెందినాడు. వెల్లనయి చూచుచున్నాడు. కాలపాశము గ్రహియించి, చిత్రాశ్వని ప్రాణవాయువుల పెకల్చ పాశము విసరంబోవుచున్నాండు. సావిత్రికిం ప్రబోధముకలిగినది. సత్యవంతుని దేహమంతయు మడ్డిచెమటలు దిగపారబోసినవి. పెనిమిటి శరీరము స్పృశించినది. కనులుమూసి సావిత్రిని ధ్యానించి మంగళసూత్ర దానమొసంగుమని ప్రార్థించినది. కనులు తెరిచినది. సమవర్తి సందర్శనమయినది. నాథునిశిరంబు తొడ నుండి జారిచినది. దివ్యపురుషునకు సాష్టాంగ నమస్కార మాచరించి నది. ఓ మహానుభావా! నావిభుండు ప్రాణావసాన సమయమున నున్నవాండు. యీతని కేదయిన దివ్యౌషధ మొసంగి ప్రాణదానము

సేయుము. పతిభిక్ష పెట్టుము. అని పైటచెరుగు సాచినది. తను కాజన్మాంతము దాసినైయుందునని పాదములు పట్టినది. సాధ్వీ తేజోప్రభావమునకు నించుకంత యముడు జంకినాడు. తల్లీ! నేను సిద్ధుండను. దివ్యుండనుకాను. నీనాధుని బ్రతికించుటకు రాలేదు. యాతని ప్రాణములు గొనిపోవుటకై వచ్చినాను. నాపేరు యముండందురు. పతివ్రతాశిరోమణీ! నీనాధునికి భూమిపై జీవితకాలము నిండిపోయినది. ఇంక దివ్యలోకమున కేగుచున్నాడు. దూరముగా నుండుము. మాదర్శనము సామాన్యజనులకు లభింపదు. నీవు పరమ పుణ్యాత్మురాలవు. నీ యదృష్టమువలన మా దర్శనము లభించినది. యని పలుకుచుం గాలపాశము సత్యవంతునిపై విసరినాడు. సావిత్రీదేవి యముని పాదము పట్టినది. స్వామీ! తమసేవకులే యిటువంటి కార్యము లొనర్చుటకు సమర్థులగా పెక్కుమంది యుందురని వినియుంటిని. యీ ఘనకార్యమునకై తామేల స్వయముగా దయచేసినారో, యని గంభీరముగా పలుకు సావిత్రీదేవినిం జూచి. సాధ్వీ శిరోమణీ, సత్యవ్రతాచరణ దీక్షా పరతంత్రులు, మాతా పితృ సేవకులు, అహింసాధర్మ పరాయణులు, అతిథి పూజా ధురంధరులు. మాకు వందనీయులు. కావున, మేము స్వయముగా మా లోకమునకుం దీసికొనిపోయెదము. నీనాధుండు సకలసద్గుణరాశి యగుటచే మేము స్వయముగా వచ్చినాము. మమ్ములను విడిచిపెట్టుము. కాలయాపన సేయరాదు. తొలంగిపొమ్ము. అని సత్యవంతుని ప్రాణ వాయువుల సూక్ష్మ శరీరమునుండి లాగవేసినాడు. సత్యవంతుని, విశ్వాసమారుతములు శమించినవి. సావిత్రి నేత్రములు జలపూరితము లయినవి. ప్రపంచ మంధకార బంధురమయినది. క్షణకాలము రిచ్చపడినది. భర్తృశవమును ముమ్మారు వలగొనినది. ధైర్యకవచము దొడిగినది. సతీధర్మమున కసాధ్య కార్యము లేదను సిద్ధాంతము స్థిరపరుపదలచినది. నవీన బ్రహ్మాండములు సృష్టించుటకు సంసిద్ధురాలయినది. భూతసృష్టి క్షణకాలములో విచ్ఛిన్నతర స్వరూపము గలదానినిగాం జేయదలంచినది. పెనిమిటి శరీరము దాచిపెట్టెను. ఆ శవమునకు నగ్నిప్రాకార విద్యచే తేజోపంజరనిర్మాణ మొనరించినది. భూతకోటి

నాహ్వానించి కాపుపెట్టినది. పైట నడుమునకు బిగించినది. అంతట పితృపతియు సత్యవంతుని ప్రాణవాయువులు దివ్య దేహమునఁ బ్రవేశింపఁజేసి సంయమినీ నగరాభిగమనుఁడైనాఁడు. సావిత్రి వెంటాడినది. యామె ముఖమునుండి వెలువడు దివ్యకాంతులు ముందు వ్యాపించుచున్నవి. భూమండల మంతయు నవీనాలంకారము దాల్చినది. యముఁడు లోలోన నబ్బుర మందుచున్నాఁడు. సావిత్రి, అయ్యా! సమవర్తీ! దీనమాలిన యిల్లాలనై జగం బంధకారమయినది. నాకన్నులు కాలిపోయినవి. పతివిరహితనై ప్రపంచము చూడలేను. తండ్రీ! సతీపతుల కెడబాటు సేయవచ్చునా? శరీరార్ధభాగము స్వర్గలోకమున, మిగిలినభాగము భూలోకమున యుంచుట నీకు న్యాయమా? నన్నుఁగూడఁ గొనిపొమ్ము. దయఁజూపుము. దిక్కుమాన మొరాలించుము. ఆడుదాని కుయ్యాలించుము. అని మొరలిడు సావిత్రిని ధర్మరాజు చూచినాఁడు. పశుపత్నిసుతాదులు ఋణానుబంధరూపులు. కర్మబాధము తీరినది. నీభర్త మా స్వాధీనమయినాఁడు. కొంచెము వెనుకముందు వ్యవధగాని, యందఱు లోకాంతరము చేరవలసినవారె. నీ పెనిమిటి బ్రతుకుకాలము తీరిపోయినది. యింక నీవు వెనుకకు మరలుము. నీభర్తకు జరుపవలసిన యౌర్ధ్వదైహికక్రియలు జరుపుము. దైవవిధిఁ దప్పింప నెవ్వరికిఁ దరముగాదు. పురుషకారము దైవవిధినిఁ దప్పింపఁగలదా? భర్తలపై మెవ్వరికనురాగముండదు. వారందరు భర్తలను బ్రతికించుకొనలేకపోయిరా! నీమాత్రము పట్టుదల వారలెఱుంగరా! దైవవిధి దాటుట దుర్లంఘ్యము సుమా.

చ॥ పవనమువీచఁ బట్టువిడి వ్రాలెడు శుష్కపుటాకులట్టు లీ
యవనిని రాలు కాలపవనాహతిపాత్రియె జీవకోటి యీ
భువిపడు పర్ణముల్ విరుగఁబొందుట చెట్టును చూచినావఁదీ
ధవుడటుగాదో యోజనలదా కలదా విధిదాఁట నేర్పదే.

ప్రేమపాశము తెగఁగోసికొనుము పొమ్ము అని పలుమరు వచించినాడు. కాని సావిత్రి మనోదార్ఢ్య మీ మాటలవలన మిక్కిలి చేవగలదియైనది. ధైర్యవారవాణము ధరించినది. సావిత్రీ దయారథం

చెక్కినది. మునిగురుజనాశీర్వాద సేనాపరివృత యయినది. పాతి వ్రత్య శరాసనము ధరించినది. సాహసశరానుసంధానము గావించినది. సత్యవంతుని జీవసామ్రాజ్యము హరించుకొనిపోవు యమధర్మ రాజుతోఁ బోరి తనపెనిమిటి ప్రాణరాజ్య సంపద నాచంద్రార్కముగా స్థాపించఁదలఁచినది. పురుషకారము కార్యసాధనమా, దైవ విధి యని యూరకుండవలయునా యను సంశయము సిద్ధాంతము చేయ నిశ్చయించినది. తిరుగా ధర్మరాజునకు నమస్కరించినది. యీ దిక్కుమాలిన కుయ్యాలించుమన్నది. అంతట సమవర్తి తల్లీ! వెనుకకుఁబొమ్ము. అని బ్రతిమాలినాఁడు. సావిత్రి కామాట వినుపడలేదు. పతిభిక్ష యని పైటచెరగు చాచినది. దోసిలి పట్టినది. సాష్టాంగ నమస్కారము చేసినది. యేమిచేసిననేమి? యముడీసాహసకార్యము చూచినాఁడు. సావిత్రియం దించుక దయకలిగినది. అమ్మా! చీఁకటిపడినది. నీపతి బ్రతుకఁడు ఆశ విడుము సాధ్వీ యనినాఁడు. నాభర్తతోఁగూడ వెనుకకు బోయెద. నా యత్తమామలు పుత్రుఁడేడియను యమలోకమున కంపివచ్చితినని యీ సావిత్రి చెప్పఁజాలదు. నిశ్చయమని పెద్దగా దూఁడనువీడిన యావువలె బెగ్గడిల్లుచుఁ బలికెను. ఆపత్సమయమున నెంతటివారికయినను ధైర్యవృక్షము విచారవాయువచే నూగులాడక మానదుకదా! సావిత్రిని చూచిన యముని మానసము కంపించినది. దేవి నీవాక్యముల కెంతయు సంతసించితి. మావంటి దివ్యులను దర్శించి రిత్తచేతులతోఁ బోరాదు. నీ పెనిమిటి ప్రాణములు తప్ప నేదయిన నొక్కవరంబు కోరుకొనుము. అని చెప్పినాఁడు. యముని మాటవిని సావిత్రి మానసంబున నిట్లు తలపోసినది. కరుణారస మంకురించినది. యముని హృదయంబున సామాద్యుపాయ దోహదంబున నీమొలకను వృక్షముచేసి, చక్కని ఫల మనుభవించెద. కానిమ్ము యిప్పుడీతనివరము గ్రహించెద. తండ్రీ! ధర్మదేవతవు. నీదయయే నాకు ముంగొంగు బంగారము. నా యత్త మామలు గుడ్డివారు. ప్రకృతము సిరిసంపదలు, దైవవశమున దూరమగుటచే నడవుల గ్రుమ్మరుచున్నారు. కావున వారి యంధత్వము పోయి రాజ్యసుఖ మందున ట్లనుగ్రహింపుము. అని సవి

నయమై ప్రార్థించినది. యముఁడా వరము "తథాస్తు" యని ప్రసాదించినాడు. చాలదూర మేతెంచితివి వెనుకకు మరలుము. నీభర్త కాచరింపఁదగిన యపరక్రియల లబ్ధచక్షువులయిన నీ యత్తమామల సహాయముచే నెరవేర్చుకొనుమని పలికెను. సావిత్రీ ధైర్యవృక్షమున కించుకంత చివురు ప్రారంభించినది. యముని చేతనున్న భర్త్రు జీవములపై దృష్టి నిలిపినది. రివ్వురివ్వున నడువ ప్రారంభించినది. దుర్గమారణ్యము ప్రవేశించినాడు. యముఁడు వెనుకకుఁ జూచినాఁడు. అపూర్వ తేజము వెనువెంట వచ్చుచున్నది. యముని కన్నులకు మిఱుమిట్లు కలిగినవి. అబ్బురపడినాఁడు దుర్గమారణ్య మార్గంబుల నెట్లు ప్రయాణ మొనరించునో, సావిత్రి యని సమవర్తి సందియం పడుచున్నాఁడు. సావిత్రి పూవుదోఁటలోఁ దిరుగుడాచున్నట్లు విలాసముగా నడువసాగినది. పంచభూతమయమగు సృష్టి సపీనాకారముఁ దాల్చినది. సావిత్రి, పెనిమిటి జీవములఁ గ్రహింపఁగలనని తలంచినది. ధర్మనామము స్మరణసేయుచు, పెనిమిటి యాతనా శరీరముపై దృష్టినిలిపినది. ఆనంద పరవశయయినది. స్వామీ! దయామయా! "సాప్తపదీనం సఖ్యమ్మని గదా లోకములోని వాడుక. దానిని వ్యర్థము సేయకుు. తమతో నేను మాటలాడుటచేతను, మిగుల దూరప్రయాణము సల్పుటచేతను మీరు నాకు పరమాప్తులు. నీబిడ్డవంటిదానను. యీ పాడువైధవ్యదుఃఖ మనుభవింపఁజాలను. తండ్రీ! యను దీనాలాపము లాకర్ణించినాఁడు. మార్గమందలి, సావిత్రీ పతివ్రతాప్రభావ సూచక చిత్రములఁ గాంచినాడు. మనమున నిట్లుగాఁ దలచినాఁడు. యించుక బెదరించ నిట్లుగాఁబలికినాఁడు. అమ్మాయీ! చూచితివా, యీ దుర్గమారణ్యము! మావంటివారికే భీతిఁగొలుపుచున్న యిటు చూడు.

సీ॥ కలవుగా నొకవంక ♦ గాండ్రుగాండ్రని యార్చు
బెబ్బులుల్ నడయాడు ♦ పేప పొదలు
పారుగా నొకచెంప ♦ హోరారని సెలయేళ్లు
విషమకంటక విలా ♦ వితత దరుల

గూయుగా నొకచాయ ♦ వాయుపూరితరంధ్ర
వితతుల నూయని ♦ వెదురు పొదలు
తిరుగుగా నొకక్రేవ ♦ వరదులు ఘూల్లున
గోలసేయుచు లీల ♦ రేలపొదల

భూత భేతాళ శాకినీ ♦ ప్రేతనివహ
కఠిన కహకహారావ ♦ ఫూత్కార ఘటిత
శరభ శార్దూల కరిఘటా ♦ సత్వచయము
కాన నోచాన! కాన కా ♦ లూనగలవె.

అమ్మాయి! బుద్ధిమంతురాలవు. వ్యర్థ శ్రమనొందకు. వెనుకకు బొమ్ము. అసాధ్యకార్యము సలుపుటకై ప్రయత్నము సలుపుట కూడ పరిహాసాస్పదము. నామాటవిని, పర్ణశాలాభిముఖవగుమన్నాఁడు. సావిత్రి మనోధైర్యము దృఢమైనది.

స్వామీ! నీ దయయున్నచో భర్తతో నడుచుటకు నాకసాధ్యమగు ప్రదేశముండదు. దివ్యపురుష సందర్శనమున గలుగులాభము సాధించుకొనియే పోయెదనని తన వెంటవచ్చు సావిత్రినిఁజూచి జాలి పడినాఁడు. తల్లీ! నీమాటలు, నీ ప్రయాసము నాకుమిక్కిలి జాలి గొల్పుచున్నవి. నీ పతి జీవితముదక్క యేదయిన నొక్కవరము గోరుకొనుము. శీఘ్రముగా నొసంగెదననినాఁడు. తండ్రీ! యింకను నాపయి దయరాదా! యని మనమున నిట్లు దలంచెను. ఈతం డెన్నివరంబుల నిచ్చి నన్నుఁ బంపునో చూచెదగాక! యని ప్రకటముగా సంయమినీ నగరాధీశ్వరా మద్రదేశాధినాథుఁడగు నా తండ్రికిఁ బుత్రులులేక మిగుల చింతిల్లుచున్నాఁడు. నా తండ్రికిఁ నూర్గురు పుత్రులు కలుగునట్లు వరము దయసేయుమని వినయముగాఁ బ్రార్థించినది. యముఁడు సంతసించినాఁడు. "తథాస్తు" నీ నూరుగురు తమ్ములతో సంపూర్ణానంద సుఖ మనుభవించు జననీజనకులఁ జూచి సంతసించుమని యాశీర్వదించినాఁడు. సత్యవంతుని యాతనాశరీరముతో శీఘ్రముగా నడచుచున్నాఁడు. సావిత్రి వెంటఁబడి వెళ్ళుచున్నది. పెనిమిటిని వీడి పర్ణశాల కేగఁదలఁచలేదు. యముని సామర్థ్యమును

పరిపూర్ణముగాఁ బరీక్షింపసాగినది. తండ్రీ! దీనురాలి మొరవినవా! భర్తృవిహీననై బ్రతుకమనియా నీ యాశీర్వాదము. నాపెనిమిటి సత్యవాది. ధర్మస్వరూపుడు. లోకరక్షణాధౌరేయుడు. మాతాపితృసేవాపరాయణుఁడు. నిష్కారణము నీలోకమునకుఁ గొనిపోవకు. కొంతకాలము భూలోకమున మననీయుము. విడిచిపెట్టుము. బ్రతికింపుము. హరిణమును బాసిన కురంగమువలె కనుల నీరుగార్చుచు బ్రార్థించుచు వచ్చు సావిత్రిని పరేతపతి చూచినాఁడు. ఎంతబేలవమ్మా! చచ్చినవారు బ్రతుకుదురను పిచ్చియాస యెట్లు గల్గినది తల్లీ! కర్మానుబంధమున జీవులు లోకాంతరవాసము సల్పుచు బ్రారబ్ధక్షయానంతరమున నాయుసాధులను విడనాడి మహాప్రళయపర్యంతము వాత్యాచక్రాంతరాళ విలులిత పరమాణువులభంగిఁ దిరుగుచుండుట స్వభావము. ఇంక భార్యాభర్తల సంబంధమా కర్మానుబంధము. ఇది శాస్త్రవిచారణ. సావకాశముగా పెద్దలవలనఁ దెలిసికొనుము. వెనుకకు బొమ్మని తిరిగిచూచినాఁడు. సావిత్రీదేవిరూపము పరాశక్తిగా మారిపోయినది. ప్రకృతి యామె స్వాధీనమైనది. సతీప్రభావము దిగంతముల వ్యాపించినది. ఆమె గాలిసోకినంతనే, దుష్టమృగములు సాధుభావ మలంకరించినవి. యామెనుగాంచి తొలంగుచున్నవి. సేవింపుచున్నవి.

సీ. మసకలారెడు పాము ♦ మడమఁ ద్రొక్కినగాని
కాటువేయుటమాని ♦ దాటుచుండె
నెదురైన దుష్టము ♦ త్తేభ యూధమ్ము
పిల్లికూనలరీతి ♦ బెదురుచుండె
శరభ శార్దూలాది ♦ సత్వనికాయమ్ము
పెంపుడుకుక్కల ♦ విధమునుండె
బరిపూర్ణముగఁ బారు ♦ వాహినుల్సాధ్వికి
నిరుపాయులై ♦ త్రోవ లిచ్చుచుండె

మింట మబ్బులు గొడుగులై ♦ వెంటవచ్చె
కాకఘూకాదు లెల్లెడఁ ♦ గేకలిడక

చిత్రములరీతిఁ గూర్చుండెఁ ♦ జెట్లమీఁద
చిత్రమగుచుండెఁ జూడ సా ♦ విత్రి మహిమ॥

అని యముఁడు అబ్బురంపడినాఁడు. తల్లీ! నీవు మహాపతివ్రతవు. మంత్రదీక్షాపరాయణురాలవు. భర్తృసేవా దురంధరురాలవు. మహాజ్ఞానివి. అయినను ప్రేమపాశము తెగుట దుస్సాధ్యము. ప్రవాహవేగమునఁ జెదరిపోవు కాష్ఠములవలె జీవులు వెనుకముందు చెదరి కర్మప్రవాహమునఁ బడిపోవుచుందురు. ఆవేగము నెవరాపగలరు. నీవుపడు ప్రయాసము నాకు మిగుల నచ్చెరువు దయయుఁ గలుగఁ జేయుచున్నది. అడియాస మానుము. నీపతి జీవితముదక్క వేరొండు వరముగోరుము. ఆ వరముఁగాని తుషాఖండనన్యాయముగ వ్యర్థ ప్రయాసపడక మరలిపొమ్మని పలికినాఁడు. సావిత్రిమనస్సు చివుక్కుమన్నది. ధైర్యమువలంబించినది. చిత్తైకాగ్రత నవలంబించినది. స్వామీ! సత్యవంతుఁడు మీస్వాధీనమయినాఁడుగదా. ద్యుమత్సేన వంశము నిర్వంశము గాకుండ, నా పాతివ్రత్యమునకు భంగము రాకుండ నాకు సంతానముఁ గలుగునట్లు వరంబు నొసంగుమని కోరినది. నమస్కరించినది. యముఁ డపారదయా కూపారుఁడయినాఁడు. సాధ్వీమణీ! నీపతిభక్తికి మెచ్చినాను. నీవాక్శుద్ధి కానందించినాను. నీచిత్తైకాగ్రత కామోదించినాను. నీసాహసమునకు సంతసించినాను. నీయమేయ పాతివ్రత్యమహిమను కనులారఁ గనుగొన్నాను. నీ యభీష్టము నొసంగుచున్నాను. నీవును నూర్గుర పుత్రులం గనుము. నీ యశము సకలాశాముఖంబుల నావరించును. నీపుత్రశతంబుతో పరిపూర్ణానంద సముద్రవీచికల నూగులాడుచు సుఖంబుండుము. పొమ్ము. పొమ్ము. నావెంటరాకుము. చూడుము. కనుపించునది వైతరణీనది. మానవకోటి తేరిచూడఁజాలరు. మానవులు జీవవంతులు రాకూడదు. వెనుకకుఁ బొమ్మని బ్రతిమాలినాఁడు. సావిత్రి, యీవరం బొసంగుటచే యముఁడు పరవశుఁడై నాకు స్వాధీనుఁడయినాఁడు. నా మంగళసూత్రము గట్టిగా నొనరించుట కంకురారోపణ ముహూర్తము జరిగినదని సంతసించినది. తండ్రీ యని యమునివెంటఁ బడినది. నాభర్తను వీడవా! దయలేదా! నీభక్తురాలిని. అనన్యగతికను. ఇది

పతిభిక్షాదానకాలము. నేను దానపాత్రురాలను. నీవు దాతవు. నేతవు. శరణాగతరక్షణముకంటె తమబోటి మహనీయులు సేయఁదగిన ఘనకార్యము వేరుండదు. అని భర్తృశరీర సంలగ్నమానసికయై మధ్యేమార్గమందుగల వైతరణీ ఘోరనదిని తెలియకనే యాకాశగామినియై యమునితోపాటు యమలోకము చేరినది. ధర్మరాజు సావిత్రినిఁ జూచినాఁడు. లోలోన దిగులుపడినాడు. పాతివ్రత్య మహిమచే మనుజశరీరముతో యమలోకముఁజేరిన యిల్లాలు త్రిలోకవందనీయ. ఇట్టి పతివ్రతగాలి సోకిన నా పాపలోకమంతయు పాడుపడునని భయపడినాడు. లేని యహంకార మభినయించినాఁడు. సావిత్రీ యింతమూర్ఖురాలవనుకొనలేదు. ఇది నాలోకము. మనుజశరీరముతో ప్రవేశింప నలవికాదు. రాకూడదు పొమ్ము. యిటుచూడు. ఇదినరకలోకము. చూడలేవు సరిగదా, చెప్పిన వినఁజాలవు. అదర్శనీయము. అస్మరణీయము. నామాట లబద్ధములుకావు. ఇదిగో యనునప్పటికే యార్తనాదపూరితమగు నరలోక సందర్శనమయినది. సావిత్రి గుండె జల్లుమన్నది. భ్రమపడినది. పాపులను యమదూతలు పెట్టు యాతనలను చూడజాలకపోయినది. కనులుమూసినది. భగవానుఁడా యనినది. స్థాణువువలె నిలువబడినది. యముఁడు సమీపించినాఁడు. నరకమందలి జీవుల నిట్లుగాఁ దెలుపఁ బ్రారంభించినాఁడు.

సీ॥ పెండ్లాము చెప్పెడి పెడనుడి చెవినిడి
తల్లిదండ్రులఁ జావఁ దన్నువాఁడు
తండ్రి తద్దినమన్నఁ దమకచ్చిరాదంచు
మానివేసిన దుష్టమతి యితండు
ముష్టికిఁ జనుదెంచు ముూగవానినిఁ బిల్చి
కుక్కల నుసికొల్పు కుమతియితడు
చెప్పుడుమాటకుఁ జెవియొగ్గు నృపునకు
నిచ్చకంబుల నుచ్చరించు నితడు

తప్తశూలాగ్రవిదళిత తాలుయుగళ
ఘోణవిణ్మూత్రగర్త సంకులితదేహ

ఘోరవృకజాల పాటిత కుక్షివిగళ
దంష్ట్రజాలులఁ బాపుల నతివగనుము!

యని తక్కిన పాపులఁగూర్చి యేమియో చెప్పఁబోవు యముడు కుంఠితవాక్కు డయినాఁడు. యాతనల ననుభవించు పాపుల శరీరముమీఁద సావిత్రీదేవి శరీరమునుండి వచ్చిన గాలి సోకినది. పాపుల కమృతవర్షము కురిసినట్లయినది. యమకింకరులు పెట్టుబాధలు పాపులకంట్లుటలేదు. తల్లీ! రక్షించుము. రక్షించుమని పాపులు చేతు లెత్తి మొరలిడుచున్నారు. పతివ్రత చూచినది. ఆ యిల్లాలు కన్ను త్రిప్పినది. చూపులనుండి యమృతప్రవాహములు వెలువడినవి. సంయమినీనగరమును ముట్టడించినవి. పితృపతి తెల్లబోయినాఁడు. విభ్రాంతు పడినాఁడు. సావిత్రీ భూలోకము చేరవా యనినాఁడు. ఆతల్లికి మానసమున నపూర్వ జ్ఞానోదయమయినది. నాభర్తను నాకొసంగుము. పాపులనుగూడ వదలివేయుము. అనినది.

యముడు—దివ్యులతో పరిహాసమా. నీభర్త తెరతేరగా స్వాధీనుడు.
సావి—పతివ్రతతో యాగడమా. నాభర్తను తీసికొనియే పోయెద.
యముడు—అట్లయిన మాతో ప్రతిఘటించెదవా?
సావిత్రి—నావిధికై దైవతములతోఁ బ్రతిఘటింపవలసిన తప్పునా?
యముడు—పాపాత్ములు పాపఫల మనుభవింతురు.
సావిత్రి—ఇక పాపములు భస్మావశేషమని తలంపుము.
యముడు—లోకములను తిరుగ సృష్టిసేయుదుననియా నీ యభిప్రాయము.
సావిత్రి—అభిప్రాయమననేల సిద్ధాంతము.
యముడు—అట్లయిన నా సామర్థ్యము చూడఁదలచితివా?
సావిత్రి—చూచివాను. చూచుచున్నాను. చూడఁగలను. దయామయా! దయయుంచి నా భర్తను విడిచిపెట్టుము.
యము—అది ఘటించుట దుర్ఘటము.
సావిత్రి—వరదానంబు చెల్లించవా?
యముడు—నీభర్త బ్రతుకడని చెప్పలేదా.

సావిత్రి—సమవర్తీ! యోచించకనే యిట్లనుచున్నావు. నా తుదివర మేమని?

యముడు—సంతానవతివి గమ్మని,

సావిత్రి—నీ వన్నమాట చెల్లించుకొనుము. నా యభిజాత్యము కాపాడుము. నీ కన్నబిడ్డను. దుర్ఘటమగు నీ లోకమునకు వచ్చినాను, పుత్రికాప్రేమంజూపి పసుపుకుంకుమ పెట్టింపవా? పాడుమొగముతోం బంపందలంచితివా? తండ్రీ! నీవాడిన మాట జ్ఞప్తికిం దెచ్చెద ఆలకింపుము.

చ॥ సతివి సుశీల నీవని ప్రశంసలొనర్చియు మున్ను నాకు స
త్సుతశత సద్వరంబొసంగి సూనృతవాది యిదేమి యిప్డు నీ
పతిబ్రతుకందు పొమ్మనుచుం బల్కెద వల్కంగ నోపరేతరా
ట్పతీ! యిది నీకు న్యాయమనవచ్చున, మెచ్చున, రచ్చచర్చలో॥

ఏమి ధర్మరాజా! మాట్లాడవేమి.

యముడు—ఎందులకు?

సావిత్రి—అన్నమాట చెల్లించుకొనుటకు.

యముడు—నీభర్త కాయువ లేదు.

సావిత్రి—నాపెనిమిటి కాయువ లేదా! లేదా! లేకున్న రాదోయని నది. స్త్రీలకు పతిసేవ పరమపద సౌధారోహణ నిశ్రేణి యని నిశ్చయించినది. పెనిమిటిలేని ప్రపంచము చూడనని నిశ్చయించినది. సావిత్రీ దేవిని ధ్యానించినది. ఓ సమవర్తి! నాభర్త ధర్మశీలుండు. నేను, నిజమగు పతివ్రతను. నాభర్తనువిడువకుండిన, లోకజాలములు నిలువవు. నీవు నీ లోకను నిలుచు మార్గము చూచుకొనుము, ఓ పాపులారా! మీరందఱు సావిత్రీదేవిని ధ్యానముచేయుడు. పొందు స్వర్గమునకు. అనుమాట నోట వెలువడిన తోడనే, దివ్యరత్న మరీచి జాలముతో విమానకోటులు, మింట ప్రేలాడసాగినవి. పాపులు నరకమునుండి విముక్తినొందినారు. దివ్యరూపధరు లయినారు. విమానముల నధిరోహించినారు. యముండు చిత్రప్రతిమవలె నిలువంబడినాండు. తల్లీ! దీర్ఘసుమంగలీభవ. యని దీవించినారు. ముల్లోకములు వడవడ వణంకసాగినవి, భూతపంచకము పరమాణు రూప

ములు దాల్చినది. మారుతము వీచలేదు. జీవకోటిలో గల ప్రాణ వాయువులు స్తంభించినవి. అగ్ని చల్లారినది. నదీ ప్రవాహములు పాషాణప్రాయము లయినవి. భూదేవి, సావిత్రిని మోయఁజాలక క్రుంగిపోయినది. అప్రయత్నముగా సావిత్రి నోటినుండి, లోక మాతా, ఆర్యా! సకలశక్తి స్వరూపిణీయని పేరువహించిన యో సావిత్రి! సజీవుఁడగు నాథర్త నీ క్షణమున నా కనులముందరఁ గనుపింపఁజేయకున్న ధర్మాధర్మములు, వ్యత్యయములు వ్యత్యయ ములై, లోకజాలము మూకీభావము వహించకుండునేమో చూచెద గాక, యని క్షణము కనులుమూసినది సావిత్రి. యముఁడు శరీరము మంటలెత్తసాగినది. ఓ కాత్యాయనీ, ఓ వైకుంఠవాసా, ఓ కైలాస పతి రండు రండు. యీ యకాలప్రళయము విలోకింపుడు. సత్యవంతుని బ్రతికింపుడు. దీనరక్షణ మాచరించుడు. యముని ప్రాణములు కాపాడువారు వెలువడుడు. సావిత్రీ! నమస్కారము నన్నింపుడు. అని మొరలిడినాఁడు. యోగసమాధి లగ్నస్థిరచిత్తయై భర్తృరూపధ్యాననిష్ఠా గరిష్ఠయగు సావిత్రిమైమురచినది. మింటనుండి తల్లీ శాంతించుము, శాంతించుమని, శాంకరీ, సత్యవంతు నొసంగుము. అను కేకలు వినఁబడినవి. సావిత్రీదేవి సత్యవంతునితోఁ బ్రవేశించి నది. ముమ్మూర్తులు ప్రత్యక్షమయినారు. ఓ పతివ్రతాశిరోమణీ! నవీనసృష్టిసంకల్పము మానివేయుమని దోసిలి యొగ్గినారు. వేల్పులు పువ్వులసోనలు కురిసినారు. దేవతల సాధువాదములు భూనభోంత రాళములు ఘోరుకొలిపినవి. సత్యవంతుఁ డీ దృశ్యము కలయా నిశ్చయమా యని నిశ్చయింపఁజాలక వితాకుపడి, ధైర్యము తెచ్చు కొని ముమ్మూర్తులకు నమస్కరించినాఁడు. భార్యను సమీపించి దేవి యని పాణిని గ్రహించినాఁడు. సావిత్రి కనులు విప్పినది. లజ్జా పరవశ యయినది. సావిత్రిదేవికి నమస్కరించినది ముమ్మూర్తులు సతీసమేతులయి పతివ్రతను శ్లాఘించినారు. నీ యత్తమామలు లబ్ధ చక్షువులై మిమ్ములఁ జూడఁగోరుచున్నారు. మీ శత్రువులు భస్మావ శేషు లయినారు. విమాన మధిరోహింపుడు అని సావిత్రీ సత్య వంతుల విరితేరుమీదఁ గూర్చుండఁబెట్టినారు. తలిదండ్రుల సమీప

మునఁ జేర్చినారు. కోడలిని, కొడుకుని చూచుకున్నారు. దేవతా మండలికి నమస్కరించినారు. సావిత్రీ వంశపావనియని తెలిసికొని నారు. ఆశ్రమవాసు లందఱు సంతసమందుచు నచ్చెరువందినారు. మూర్తిత్రయము సావిత్రీ సత్యవంతులఁ బదివేలవత్సరములు భూలోక మేలి, నూర్గురు తనయులతో నానందించుచు వైకుంఠము చేరుడని దీవించి వారిలోకముల కేగినారు. సాళ్వదేశమునుండి కొందఱు పౌరు లేతెంచి శత్రురాజులు నశించిరి. తాము దయచేసి రాజ్యపాలన మొనర్చుడని ప్రార్థించినారు. ద్యుమత్సేనుఁడు యీవార్త లాలించి చనుదెంచిన యశ్వపతియు సాళ్వదేశంబునకేగి సత్యవంతునకుఁ బట్టాభిషేక మొనరించినారు. సావిత్రి పాతివ్రత్యమహిమ యమేయ మగు విఖ్యాతి వహించి ప్రపంచమున స్త్రీలకెల్ల వరవడి బంతియై ప్రకాశించినది. స్త్రీల పాతివ్రత్యము ముమ్మూర్తులను జయించి నవీనసృష్టి జేయఁజాలును కావున భారతమాత గర్భంబునఁ బుట్టిన స్త్రీలందఱు పతివ్రతలై మనుదురుగాతమని సర్వదా దేవుని ప్రార్థింపుడు.

---

# అనసూయాదేవి.

బ్రహ్మమానస పుత్రులలో నొకండయి, ప్రజాపతియు, బ్రహ్మ ఋషియునై తపోమహిమచే ముమ్మూర్తులను మెప్పించిన మేటి తపస్వియై, ముమ్మూర్తులు తండ్రిగా భావించుచున్న యత్రియను మహర్షి యొక్కఁడు కలఁడు. ఆ మహాముని యాశ్రమము శాంతము గాను, పావనముగాను, దివ్యానందదాయకముగాను, మనోజ్ఞముగ నలరారుచున్నది. మఱియు నా మహామహుని తపఃప్రభావముసహజ దుష్టస్వభావముగల సత్వసంతానములు గూడ నన్యోన్య వైరాను భావములు వదలి పరస్పర సహాయములచే నేక కుటుంబమువలె మెలంగుచుండె. ఏనుగులు మొసలి సింహములు విహార మొనరింప దొండంబులు కైదండగా నిచ్చుచుండును. యీనిన పులుల పొదల లోనికి లేడులు పురిటి తగువులు గొని పోవుచుండును. గండకములు

నిద్రపోవుచుండ శరభంబులు కొనగోళ్ళ సిరము దువ్వుచుండును. ఎలుకలు పిల్లిపిల్లలతోఁ జెగ్గాడుచుండు. పాముపిల్లలను పురివిచ్చి నెమిలిపిల్లలు నాడించుచుండును. ఇట్టి ప్రశాంతవనమునకు, నమూల్య వైభవం బొసంగుచు నిందిరారమణివలె భర్తృ పదారవింద సేవా తత్పరురాలైన యనసూయయను ధర్మపత్నితో గార్హస్థ్యధర్మముల నిర్వర్తించుచు నత్రిసంయమి చిరకాలము కర్మపరాయణుండై కాలము గడుపుచుండె. యనసూయ వేకువజామున మేలుకాంచి గృహకృత్యముల నిర్వర్తించుకొని, యగ్నిసేవయు, దేవతాసేవయు, నతిధిసేవయు, భర్తృసేవయు సర్వదా సలుపుచు కంటికి రెప్పవలె పెనిమిటిని కాపాడుచు మహానదులు సముద్రమును చేరునట్లు, జీవులు పరబ్రహ్మాయం దైక్యమయినట్లు, సకలదేవతులకుఁ మ్రొక్కిన, నమస్కారములు నారాయణునిం జెందినట్లు సర్వేంద్రియ వ్యాపారము, మనోవృత్తులు, వేయేల ప్రపంచమంతయు, నా మూర్తిత్రయ తత్వము సర్వము తన భర్తయేగాని చరాచర ప్రపంచమం దన్యతేజంబు లేదనునట్లు భావించి దృఢచిత్తయై, కాలము గడుపుచుండె. అంత కంతకు నామె యొనర్చు మనోవల్లభ సేవాతపః ప్రభావంబున, పుట పరిపాకముల వన్నెలనీను పసిండివలె, క్షణక్షణ ప్రవర్ధమాన శరీర ప్రభా సంక్షాళిత దిగంతరాళయై విరాజిల్లుచుండె. అట్టియెడ నొకనాఁడు బృందారకేంద్రుఁడు భూలోక వృత్తాంత మారయఁగోరి ప్రప్రథమంబున తాపసాశ్రమంబులఁ జూచుచు వేడుకతో బయలుదేరి క్రమముగా నత్రి మహాముని పర్ణశాల సమీపించె. అనసూయా సతీధర్మ ప్రభావ మమేయము. వాయుదేవుఁడు అనసూయ శరీరము సోకిన నేమి ముప్పువచ్చునో యని గడ లాడుచుండును. సూర్యభగవానుఁ డనుకూలముగా మిక్కిలి కఠినముగా గాని, మిగుల మందముగాగాని తన కిరణప్రసార మా యిల్లాలి మేను సోకునేమో యని సర్వదా మనంబునఁ దలఁచుచు సంచరించుచుండును. వృక్షజాతు లా యిాలువరాలి హస్తసంస్పర్శచే నెల్లపుడు పల్లవితములై, కుసుమితంబులై, ఫలవంతములై చూచువారలకు ముద్దుల మూటలై కనుపట్టుచుండు. మహేంద్రుఁ డా మహనీయులగు

మునిదంపతులఁ జూచి నమస్కరించి యాశీస్సులనంది చనుచు, నామె శరీర సౌష్ఠవ సౌకుమార్యాదులకు భ్రమపడి, చిత్త మన్యథావృత్తి యగుటచే మధ్యేమార్గమున శిలాప్రాయుఁడై, చిత్రిత ప్రతిమవలెఁ గదలలేక నిలువఁబడినాఁడు. ప్రాణమున్నదా! పోయినదా! యను సంశయ మేర్పడినది. వేల్పులు గుమిగూడినారు. బృహస్పతి వచ్చినాడు. ఋషి ప్రపంచమంతయు నింద్రుని ముట్టడించినది. అశ్వనీదేవతులు వచ్చినారు. మందులమూటలు విప్పినారు. ద్రోణాద్రికి పరుగిడినారు. మందుచెట్లు తెచ్చినారు. పసరులు పోసినారు. మందులు నూరినారు. దేవేంద్రునికి నొసంగినారు. పసరులు రాచినారు. పట్లు వేసినారు. భూతవైద్యులు శరీరమంతయు బూడిదె పూసినారు. దిగదుడుపులు పెట్టినారు. ఏమిచేసిన నేమిలాభము? బూడిదలోఁబోసిన పన్నీరు. మందులత్రోవ మందులదే, యింద్రునిత్రోవ యింద్రునిదే. రోగమొకటి మందు మఱియొకటి. యీ రోగము సాముద్రికములకు, చేతినాణెములకు, భూతవైద్యములకు, మంత్రదీక్షలకు, తాయిత్తులకు రక్షరేకులకు లొంగునదికాదు. అనిమిషులంద ఱేటమోములు వేసినారు. గ్రహమండలంబుల గతులు మందములగుచున్నవి. మహేంద్రుని విమానము మింటను నిలువఁబడినది. యీ వింతకుఁ గారణ మూరయలేక సభ్యులు గుసగుసలాడ ప్రారంభించినారు. బలసూదనుడు బిగిసిపోవుటకుఁ గారణము తెలియక యల్లాడుచున్నారు. ఈవింతఁ జూచుటకు నత్రిమహామునియు, శచీకాంతుని సమీపించినాఁడు. శరీరవైఖరిఁ గనిపెట్టినాఁడు. వేల్పువెజ్జులఁ బిలిచినాఁడు. జాడ్యకారణము స్వభావము, గమనించినారా యని, ప్రశ్నించుచున్నాఁడు. అమరవైద్యులు తెల్లమొగము వైచినారు. తపోధనుఁడు దివ్యదృష్టి నుపయోగపరిచినాడు. దేవేంద్రుని కైతవ స్వభావము గుర్తించినాఁడు. చేసికొనినవానికిఁ జేసికొనినంత యనియుఁ "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అని పలికినాఁడు. అనిమిషేంద్రుని మొగముచూచినాఁడు. అమరేంద్రుఁడు లజ్జపడినాఁడు. వాచంయమికినమస్కరించినాఁడు. మహర్షి క్షమించి "పశ్చాత్తాపేనశుధ్యతా" మన్నాడు. అమరనాయకుఁడు చేసిన తప్పునకు చెంపలువేసికొని,

అనసూయాదేవిని ప్రార్థించినాఁడు. తల్లీ! బుద్ధివచ్చినది. అజ్ఞానములో పడినాను. తల తిరిగినమాట సత్యమే, సీలావణ్యాల హోరిలో మునిగిపోయినాను. కామాంధకారములో గ్రుడ్డినయినాను. మహాశక్తివని యెఱుంగకపోయినాను. క్షమాభృత్పతి ప్రోక్షిప్త కౌక్షేయకుడనను గర్వ మడిగిపోయినది. క్షమించుమనుచున్నాను. దాసుని తప్పు దండముతో సరి యనినాను. బిడ్డలు దుష్టులుండురుగాని, దయాహీనులగు తల్లులుండరా యనినాఁడు. కనులవెంట నీరు గిరగిర తిరిగినది. అనసూయా మానసము నీరువలె కరిగినది. కరుగిడి వచ్చినది. మహేంద్రా! నీవేల యింత బేలవయితివి. నీకణుమాత్రమపకారము నేను చేయలేదు. సర్వసాక్షి భగవానుఁడు ప్రమాణము. అనుమాట నోటినుండి తిన్నగా వెలువడలేదు. ఆకాశమునుండి సత్యము, సత్యము. మహేంద్రుని మానసాపరాధము దీనికి కారణము. అగ్నిజ్వాలల వేడిమి యప్రయత్న పూర్వకముగా సమీపించినను సోకక మానదు. పతివ్రతలపై దురూహ జనించినను మహాపాతకమె. శిక్షణీయుఁడే, యని భూతము లాక్రోశించినవి. అనసూయ పాపము శమించుగాత మనినది. ఆసాధ్వీ శరీరాగత మారుతము మహేంద్రుని శరీరము సోకినది. అవయవములు స్వాధీనము లయినవి. అనసూయాత్రులకు నమస్కరించినాఁడు. అమరావతి చేరినాఁడు. గ్రహమండలముల గతులు యథాప్రకారముగా సాగినవి. యా ముని దంపతులు మహేంద్రపరాభవమునకు విచారపడినారు. కర్మగతి దప్పదనియు మహాగహన ప్రయాణమువంటిదనియు దలపోయుచు సద్వ్రతోనుష్ఠానాదులఁ గాలము గడుపుచుండిరి. ఇట్లుండ ముమ్మూర్తులు విలాసార్థము దివ్యవిమానారూఢులయి భూలోక సంచారమొనర్చుచు క్రమముగా నత్రిమహర్షి పర్ణశాలమీఁదనుండి చనుచుండిరి. ఆ మహాముని పర్ణకుటీరముమీఁద విమానము నిలువఁబడినది. వెనుక ముందు కదలలేదు. వైమానిక యంత్రవేత్తలు పలువిధముల శ్రమపడినారు. కదలకుండుటకుఁ గారణ మారయలేక యల్లాడినారు. యీ యాశ్రమ మెవరిదియా యని యోచించి పతివ్రతా శిరోరత్నము, అత్రిమహాముని ధర్మపత్ని అనసూయ నివసించు పవిత్ర

ప్రదేశమని యెఱింగి, ఓహో! యీ యిల్లాలువరాలిమీఁదనుండి పక్షి కూడ సంచరించలేదు. ఆమె మెయిమీఁద నితరుల నీడ సోకకూడదు. ఆమె మెయినుండి బయలువెడలుచున్న దివ్యదీప్తులు త్రిమూర్తుల పుష్పకము నాకర్షించినది. పతివ్రత తలమీఁదనుండి దాఁటిపోవుటకు సమర్థులెవరు? ఇనుపముక్కను సూదంటురాయి లాగినట్లు ముమ్మూర్తులను పతివ్రతాశరీరసముద్భవ దివ్యమరీచులు దిగంతరాళముల మిరుమిట్లు గొలుపుచు నరికట్టివేసినవి. సృష్టిస్థితిలయ సామర్థ్యాదులుగల మూర్త్రిత్రయము విభ్రాంతిపడినది. భవిష్యత్కార్య మూహింపలేక పోయినది. కాలగతి నెవరు దప్పింపగలరు. బ్రహ్మదేవుడు కుమ్మరివానివలె ఘటకల్పనయందు సర్వదా దేనిచే నియమింపఁబడినాఁడో, సకల బ్రహ్మాండభాండోదరుడు వైకుంఠమూర్తి దశావతారారణ్యసంచారియై దేనిశక్తిచే నల్లాడుచుండినాఁడో, దిగంబరుఁడై శ్మశానవాసియై పుర్రెను ధరించి భిక్షమెత్తుట కెయ్యది కారణమో యా కారణమే నేటి విమాన ప్రతిబంధమునకుఁ గూడ నదియె ముఖ్యకారణమని చెప్పక తప్పదు. అంతట మూర్త్రిత్రయము వారివారి వాహనములను రప్పించి యధిరోహించి చననెంచిరి గాని గరుటామంతుడు మహావిష్ణువును మోయఁజాలక తెక్కలాడించి నోరుదెరచి చతికిలఁబడియె. నందీశ్వరుఁడు బలహీనుఁడయి కాళ్లు కదల్పలేక మ్రొగ్గతిలఁబడియె. ఈశ్వరుఁడు భిక్షాపాత్రతో క్రిందికి దుమికెను. తాతగారి సంగతి చెప్పవలసిన దేమున్నది. సుకుమారమగు రాయంచ గరుత్తులు వ్రేలాడ, మెడ ప్రక్కకుత్రిప్పి గ్రుడ్లు పైకియుబికి, యూపిరి తిరుగక చచ్చితిరా బాబూయని పైనున్న యాజమానిని మోయఁజాలక త్రాడుతెగిన గాలిపటమువలె పల్టీలు కొట్టుచు నే పోదరింటనో వివశమై పడిపోవుచుండ, బ్రహ్మపురుషా యని గొల్లున గోలపెట్టుచు నేలఁగూలి, యొడలు సవరించుకొని, గడ్డము చిక్కు విదల్చుకొని మెలగఁబడిన కాలు జాడించుకొని యించుక మందగమనముతో శివకేశవుల డాయవచ్చె. కాలము మారినది. పతిదేవుల శ్రీభావము లమేయములని యూహించి యా పతివ్రతకు నమస్కరించి పోవుదమని యనుకొనిరి గాని కర్మ యట్లు చేయనిచ్చునా?

అనసూయను పరీక్షించి పాతివ్రత్యమును భంగముసేసి, తమ ప్రతాపము వెలువరించవలయునను బుద్ధి కలిగి యుపాయములు సిద్ధాంత రాద్ధాంతములమీఁద నిశ్చయించి, త్రిమూర్తులు ఋషివేషధారులయి మాధ్యాహ్న కాలమునకు నతిథులుగా నత్రిమహాముని యాశ్రమమున కేతెంచిరి. నిష్కల్మష హృదయులగు నాదంపతులు అతిథుల నెదుర్కొని సాష్టాంగము లొనరించి యథాశాస్త్రీయముగాఁ బూజించి, యాతిథ్యము స్వీకరింపఁ బ్రార్థించిరి. "ఓం" యని యంగీకరించిరి. అనసూయ యతిథులకు గాను ప్రత్యేకముగాఁ గ్రొత్తక్రొత్త పిండివంటలు చేయుటకు పూజాద్రవ్యములు దేవార్చనాదులకు సిద్ధము సేయుటకు నింటిలోపలి కేగెను. అత్రియు జడదారులతో నించుక ధర్మశాస్త్ర పరిశంస లొనర్చి మాధ్యాహ్నిక క్రియాకలాపముల నిర్వర్తించఁ జనిరి. మూర్తిత్రయము గుమిగూడినది. పతివ్రతా పరాభవ బ్రహ్మాండ సృష్టికై యాలోచించుట ప్రారంభించినారు. ఎట్టకేలకు పిచ్చిపిచ్చిగా సృజించినారు. కాని తాముమాత్ర మీ సతీప్రభావ సామ్రాజ్య విభవ విధ్వంసన మహా సమరమునందు గెలుపుగాంచెదమను ధైర్యము, లోన నెవ్వరికిలేదు. యా గృహమేధి వైశ్వదేవాదుల నాచరించి సాధ్వీమాన భంగోపాయ మహామన్త్రానుష్ఠాన పరవశులగు కపట శాపాయుధుల నాహ్వానించినాఁడు. తగు పీటలపై గూర్చుండినారు. స్థలశుద్ధియయినది. భాజనములు (విస్తళ్లు) వేసినారు. వడ్డించుటయే తరువాయిగా నున్నది. అనుష్ఠానము లయినవా, వడ్డించమనెదరా యని యనసూయ, భర్తృనానతిఁ గోరినది. త్వరగ కానిమ్మనినాఁడు. కైతవఋషులు, యొకరి మొగము లొకరు చూచుకున్నారు. మీరు, మీరు, ప్రారంభించండి, ప్రారంభించండి యని కను సన్నలు చేసికొన్నారు. ఛాందసుఁడగు బ్రహ్మయ్యగారికే యగ్రతాంబూలమిప్పించినారు. యేమో చెప్పవలయునని, విధాత గుండెలుసవరించుకొని, నాలుక చప్పరించుచు, పెదవుల నాడించుచు, కొన్నియక్షరముల మ్రింగుచు, యొడలు చెమటలుగ్రమ్మ పెడమొగము పెట్టుకొని, యతికష్టముమీఁద, స్వామి యని, నిమ్మళముగాఁబిలిచినాఁడు.

బుద్ధిమంతులు కపటకార్యము లొనరింపఁ జాలరుగదా. అట్లు చేయ వలసిన భయపడక మానరు. అత్రిఋషి యేమియాజ్ఞయని, పద్మా సనునిచెంత వినయముతో నిలువఁబడినాఁడు. అయ్యా! మేము మహా శాక్తులము. మాకొక నియమము కలదు. పరాశాంభవికి నివేదించు భోజన పదార్థములు, మాకు వివస్త్రవైన మీగృహిణి వడ్డించవలయు, అట్టి పదార్థములుగాని మే మా దేవికి నివేదింపము. నివేదనానంత రముగదా భుజించుట, యను కోరిక యనసూయా భర్త విని, అయ్యా! రవికె లేని సువాసినిని జూచిన మాత్రనే సచైలస్నాన మాచరించ వలయునుగదా, యిది యేటినియమము అని మంద లించినారు. అయ్యా! మా నియమ మిది. మీ యిచ్ఛవచ్చినట్లు చేయుఁడు. లేనిచో భగవతి యేమిచేయునో చూచెదము. కాని మేము భుజింపమని నిష్కర్షగాఁ బలికినారు. విస్తరి ముందటినుంచి యతిథులం బంపుటకంటె మహాపాతకము లేదుగదా యని తెలిసి కొనినాఁడు. ఋషుల ముఖములఁ బరీక్షించినాఁడు. వీరు మాయా తాపసులని గ్రహించినాఁడు. క్రొత్తవెలుగులు మోములనుండి కొలకుల వెదఁజల్లు కుచ్ఛితపుమానులు వేషధారులని నిశ్చయించి, ప్రేయసీ! యతిథులు నీవు వివస్త్రవయి పదార్థములు వడ్డించినగాని భుజియించరట. గార్హస్థ్యధర్మము పతివ్రతలగు యిల్లాండ్రవలననే గదా! నెరవేరినా, నెరవేరకపోయినా గృహమేధి కీర్త్యపకీర్తులు, యిహపరకీర్తులు పొందఁదగినది. అతిథిపూజకన్న మించినవ్రతములు, దానములు, జన్నములు లేవు. హతాశులై బోనపువిస్తరివిడిచి యతిథు లింటనుండి పోకూడదని పెద్దలు చెప్పుదురు. అని యేమేమో యుపన్యాస మొనరింపఁబోవు భర్తనుడి నాలించినది. సాధ్వి వ్రత పరీక్షా సమయము వచ్చినది. యీ యగ్నిపరీక్షయందు నిలుచుటయా, నిలువకపోవుటయా యని యించుకంత సేపు యోచించినది. పెనిమిటి యతిథిపూజానియమము సాగించవలసిన భారము తనదే యని తెలిసి కొనినది. సతీధర్మమ వ్రతము తనకు మానభంగము కాకుండఁ గాపాడగలదని నమ్మికొనినది. పెనిమిటి సన్నిధిని వారియిష్టముమీఁద నెట్టి కార్యమయినఁ జేయవచ్చును. అని నిశ్చయించుకొనినది.

భోజనపదార్థములు పళ్లెరంబున సిద్ధముచేసికొనినది. నాథు ముఖారవిందము చూచినది. పాదారవిందములకు నమస్కరించినది. పాపపుణ్యములు భరింపఁదగిన భారము నీదే యనినది. అగ్నిగుండమున దుముకుచున్నాను. చందనశిలకలె నన్ను పైకిఁదేల్చునో కీలాభీల జ్వాలలచే నిలువున నన్ను నీరునీరుగా తగులబెట్టునో పరిశీలింపఁదగిన మనీషావంతుఁడ వీవేసుమా! యని ప్రార్థించినది. పంచభూతములారా! వేదపురుషా! పరబ్రహ్మరూపా! లోకజాలముల తదేకనిష్ఠతో పాతివ్రత్యధర్మపరాయణులగు సతీమతల్లులారా! తెగువఁబూని వివస్త్రనై పరపురుషులచెంతకు వెనిమిటి సన్నిధినిఁ జేరఁబోవు నాకు మానభంగము కాకుండఁ గాపాడు భారము మీఁదేయని నమస్కరించినది. తాపసోత్తములారా! మీబిడ్డల నీపాటి కఠినపరీక్షకు నొప్పగించెదరా? నావంటి సోదరీలును, యిల్లాండ్రును గల మేటిగృహస్థులీవిపరీతకోరికలు గోరఁదగునా? స్త్రీల మానము కాపాడఁదలఁచిన మహాపురుషులు, విరాగులగతి నావంటి దీనురాలిని కఠినపరీక్షలోనికిం దీసికొని రావచ్చునా? మీరు పెద్దలు. వివస్త్రనగు స్త్రీనిఁ జూచుట వలనఁ గలుగు ప్రయోజన మున్నదియా? నన్ను మన్నించుడు. నాశిరంబుఁ గోయుఁడు. నన్ను నిలువున నగ్నిలోఁ బెట్టి దహించుడు. ఖడ్గధారల నించుక నించుక నాదేహము తిలశఃకోసి వేయుఁడు. నన్ను జన్మదాసిగా మీపరిచారికగా నేలుకొనుఁడు. మన్నించుఁడని, పలువిధముల వేడుకొనినది. మూయూ తాపసులు, తమయభిప్రాయమును మార్చుకొనలేదు. మా నియమభంగమున కోర్వఁజాలము. మాకు క్షుద్బాధ హెచ్చుగా నున్నది. కాలాతిక్రమణమునకు నోర్వలేమనిరి. దిగ్గున పీటలమీఁదనుండి లేవఁబోయిరి. అనసూయ వద్దువద్దని పాదములమీఁదఁ బడినది. దైవగతి, యేమిగానున్నదో తెలియునా! యనినది. వంటయింటిలోని కేఁగినది. ధర్మదేవతకు మ్రొక్కినది. పంచాక్షరీ మంత్రరాజము స్మరించినది. భస్మాక్షతలు చేపట్టినది. పాదపు పళ్ళెరము చేతఁ దీసికొనినది. స్వామీ! నా యధీనము లేదుసుమా! యనినది. నిశ్చలచిత్త యయినది. వస్త్రవిసర్జనము చేసినది. భూమ్యాకాశములు బూరటిల్లినవి. భూదేవి గడగడవడకినది.

సముద్రము లన్నవు బెసరులవలెఁ బొంగి పొరలుచున్నవి. వాయువు మందగించి పోయినది. దిశ లాక్రోశింప సాగినవి. భస్మాక్షతలు ముమ్మూర్తులమీఁద వెదఁజల్లినది. వివస్త్రయయిన యత్రి యిల్లాలినిఁ జూడ వేడుకపడు త్రిమూర్తులు బొమ్మలవలెఁగూర్చున్నారు. ప్రపంచ మంతయు, ననసూయగా మారిపోయినది. వితాకుపడినారు. కనుల కపూర్వమగు తేజము కనుపించుచున్నది. తామెవ్వరో తాము మరచి పోయినారు. పసిపాపలయినారు. కావు, కావు, మనుచు యేడుపు ప్రారంభించినారు త్రిమూర్తులను బిడ్డలుగా భావించినది. చంకను బెట్టుకొనినది. గుజ్జనగూడువలె నన్నము తినుపించినది. గుడ్డయుయ్యాలలు కట్టినది. ముగ్వురిని పరుండఁబెట్టినది. లాలిపాటలు పాడుచు నూపుచు, జోకొట్టుచు, వారి ముద్దులఁ జూచుచు, కాలక్షేపము చేయుచున్నది. మహేశ్వరాదుల తెలివి తేట లేమయినవో, వారి సృష్ట్యాది సామర్థ్యము లే పూరిమేయఁబోయినవో, త్రిమూర్తుల ప్రతాపాదు లే సముద్రతీరముల విహరింపఁబోయినవో, వైకుంఠుని మాయా ప్రభావ మే పాతాళమునఁ బడిపోయినదో, శంకరుని కోపాగ్ని యే యేటిలోఁ జల్లారినదో, బ్రహ్మదేవుని బుద్ధికుశలత, యేయింట నిద్రపోయినదో, వీరిశక్తులు అనసూయాప్రభావ సూర్య కాంతి ముందఱ మిడుగురు పురుగులయినవి. పాపమా మూవురు, వారిలోకములు, వారి మందిరములు, వారి యిల్లాండ్రు వారి మహిమలు, మరిచిపోయినారు. సామాన్యజీవు లయినారు. ఆ పతివ్రత చేతులోఁ బడినది వారిబ్రతుకు. పతివ్రతా పరాభవపు వలలోఁ జిక్కుకొన్నారు. విడుదల గనజాలకపోయిరి. లేట మొగములతో నల్లాడుచున్నారు. కష్టసుఖములఁ జెప్పుటకు నోరుకూడ లేక, యేడుపు ప్రారంభించినారు. అనసూయ సంతోషముతోఁ బసిబిడ్డల శ్రద్ధతో పోషించుచు; భగవత్సేవానంద సాగర డోలికలలో నూగులాడుచున్నది. లక్ష్మీ సరస్వతులు పార్వతి, పెనిమిటుల నెడబాసినారు. వారి వృత్తాంత మారయలేక పోయినారు. పాపమా యిల్లాండ్రు మాత్రము భర్తల జాడఁదెలియక యెన్ని దినములు గడుపఁగలరు. యొకరిలోకము, యొకరు వెళ్ళినారు. మనోపరితాప

ములఁ దెలుపుకొన్నారు. ముమ్మూర్తులను దాచిపెట్టిన మహాశక్తి యెవరాయని యోచించినారు. ఇట్లు విచారించుచుండ-నంది, హంస, వైనతేయాదులు కొంతవడికి పడిన ప్రదేశములనుండి యెట్టకేలకు బయలువెడలి, బ్రతుకు జీవుఁడా యనుకొని, వారి వారి లోకముల కేఁగి, జరిగిన వృత్తాంతము వారి యిల్లాండ్రతో విన్నవించిరి. అప్పుడా మహాశక్తులు అక్కజంపడి, తమ భర్తృ వియోగ పరితాపముఁ బోగొట్టుకొను యుపాయము గానక తుట్టతుదకు నత్రిమహాఋషి పర్ణశాలకుఁ జనుటకు నిశ్చయించినారు. బ్రాహ్మణ సువాసినీ వేషములు వేసికొని, తగిన కానుకలు చేకొనినారు. వినయ వినమితాంగులై యెట్టకేలకు నా మహాపతివ్రతా మందిరమున కరుదెంచినారు. అనసూయామహాదేవి యా ముత్తైదువులఁ జూచి మిక్కిలి యానందముతో నెదురుగాఁ జనుదెంచి యర్ఘ్య పాద్యాదుల నర్పించి స్వాగతంబడిగి దర్భాసనంబులుపరిచి కూర్చుండఁ బెట్టెను. వెండికొండ కాపురమైనను, బంగారుపర్వత మిల్లయినను కాలము తప్పి పరుల యాచించిఁ బోయినపుడు రాచకీవులు పూర్వ భోగములు సమకూడునా? అంతట ననసూయ వారిపాదము లొత్తుచు తల్లులారా! మీ రాకవలన మా యాశ్రమము పవిత్రమయినది నేను నోచిన నోములు ఫలించినవి. తాము మాయింట నీ పేదరాలొసఁగు నాతిథ్యము గ్రహియించి మా వంశమును మమ్ము తరింపఁజేయుఁడు. తా రేవనిబూని యెచ్చటి కేగుచుండిరో వినుట కర్హురాలనయినచోఁ దెలియఁజేయఁ బ్రార్థించుచున్నానని యా పతివ్రత విన్నవించినది. ఆ శక్తిత్రయంబు నతీ ముఖారవిందమునుండి వెలువడు దివ్యకాంతులు గనుగొని యచ్చెరువందినవి. తల్లీ! నీవు మహాసాధ్వివి. మేమొక భిక్షార్థులమై నీయిల్లు చేరినాము. మా యాచన వ్యర్థముసేయక మా కోరిక నెరవేర్పుఁడు. అని ముగ్గురు ముత్తైదువులు పైటచెరగులు చాచినారు. సాధ్వీ! పతిభిక్షాం దేహి యనినారు అనసూయ తెల్ల బోయినది అమ్మా! విచారుపడకు. దోషము మాభర్తలదే. నీ పాతివ్రత్యము పరీక్షింపఁదలఁచి మా ముప్వురి భర్తలు చిరకాలముక్రిందట నీయింటి కరుదెంచినారు. వారి వార్తఁ దెలియలేక మే మల్లాడు

చున్నాము. మా దివ్యదృష్టులు నష్టమయిపోయినవి. మమ్మనుగ్రహించుమని పార్వతి, లక్ష్మి, సరస్వతి ప్రార్థించినారు. తల్లులా, మా యింటికి కొలఁది కాలముక్రిందట నెవ్వరో ముగ్గురు కపటయోగులు చనుదెంచి నన్ను దిసిమొలతో వారి కాతిథ్య మొసంగుమని కోరినారు. నా గౌరవము కాపాడుకొని, యతిథిపూజ సేయుట నావిధి. మార్గాంతరము తోఁచలేదు. వారలఁ బసిబిడ్డలగాఁ జేసికొని వారికి గుజ్జన గూడుపెట్టి, తొట్టెలలోనుంచి పోషించుచున్నాను. రండి యని వారి పర్ణశాలలోనికిఁ దోడ్కొనిపోయెను. వారు పసిబిడ్డల చూచినారు కాని, వారి భర్తలని గురుతుపట్టు టెట్లు? ప్రాకృత శిశువులయినారు. కాని యాత్మసంబంధము వదలలేదు. కావున నాశిశువులు వారి యిల్లాండ్రఁజూడగానే, నోళ్లు తెరుచుకొని, చేతులందించుట మొదలిడినారు. చంద్రోదయమునఁ గలువవలె వారి యిల్లాండ్ర ముఖములఁ జూడగనే వారి నేత్రముల కానందము కలిగినది. అనసూయ యీ చిత్రము తనభర్తతో మనవిచేసి త్రిమూర్తులను యథాపూర్వముగాఁ జేసినది. వారు వారి సామర్థ్యములతో వారియిల్లాండ్రతో నాపతివ్రతకు నమస్కరించినారు. నీ పాతివ్రత్యమహిమ యమేయము. అనిర్వాచ్యము. అభేద్యము. అమూల్యము. అవిచ్ఛిన్నమని పలువిధములఁ బొగడి యిట్టి విషమపరీక్ష సేయుట తగని క్షమించుమని యపరాధమని తమయకార్యమును మన్నించుమని భార్యలతోగూడ ముమ్మూర్తుల స్వస్వరూపములతో నా దంపతుల పాదములమీఁదఁ బడినారు. అమ్మా! నీ దివ్యప్రభావముచే మింటఁజనుచున్న మా వాహనములు కదలక మార్గావరోధక మగుటచే నిన్ను పరీక్షింపవచ్చినాము. పురుషులు యజ్ఞములు, తపంబులు, చాంద్రాయణాది వ్రతములు, యోగములు, ధ్యానములు, తీర్థయాత్రలు, నియమములు మొదలగునవి యెన్ని చేసినను భర్తృసేవా పరాయణులగు సాధ్వియొక్క మహిమలో సహస్రాంశము సంపాదింపలేరు. ఇట్టి యపూర్వప్రభావమే సతీమణియందుఁగానమని నుతింపుము, మే మొనర్చిన యపరాధమునకు ప్రతిక్రియగాఁ బుత్రులమై మీ పాద సేవకొనర్పం నను గ్రహింపవలయునని, సరస్వతీ మొదలగువారు సిగ్గున తలలువంచుకొన వేడుకొనిన

మమ్మూర్తులను గనుగొని లోలోననుబ్బుచుఁ బరువుపరువున నత్రిమహాముని వచ్చి మూర్తిత్రయంబునకు జోహారు లొనర్చి తెలియక నాయిల్లాలొనరించిన యపరాధము నుమన్నించుమనియు మీ పిల్లల కార్యములఁ జూచి మీరు సంతసించినట్లు దయామయులయి మీరు చూచి చూడనియట్లు నటించుటచే మాయాట సాగెనుగాని, యీ మహాశక్తులు, తమరు కనుత్రిప్పినమాత్రమున బ్రహ్మాండంబుల సృష్టి స్థితిలయాదు లొనరింప సమర్థులు. మీముందు మా ప్రతిభ లెంత? మా యపరాధము మన్నింపుఁడని యనసూయతో గూడ మూర్తి త్రయంబునకు నమస్కరింపఁగా సంతసించి మేము మఱ్ఱవరము మీకు కుమారులమను ఖ్యాతి వహించెదమని చెప్పి, వారిలోకముల కేగిరి. కొలఁది కాలములోపలనే యనసూయ గర్భవతియై బ్రహ్మాంశ వలనఁ జంద్రుని, వాసుదేవాంశమున దత్తాత్రేయుని, శంకరాంశవలన దూర్వాసునిఁ గనియెను. మూర్తిత్రయ ప్రతిమానులగు సుతత్రయంబుతో సర్వసుఖంబుల ననుభవించుచు, నాదంపతులు లోకోత్తర మగు ఖ్యాతి వహించిరి. ఆర్యావర్తమందు స్త్రీలు పతిసేవాధురంధరులయి మూర్తిత్రయంబును స్వాధీనము చేసికొనినవారు, యముని నిలువఁబెట్టి తమ భర్తను దెచ్చుకొన్నవారు, భగవంతునిచే నింట పనిపాటలు చేయించినవారు, కృష్ణునిచే కట్టుబట్టలఁ దెప్పించుకొన్నవారు, నదులను త్రిప్పివేసినవారు, చవిటిపఱ్ఱల మంచి తీర్థములు పుట్టించినవారు వేనవేలున్నారు. సర్వదా పరమేశ్వరానుగ్రహంబున భారతభూమిని పతివ్రతామతల్లులు జనించుచుందురుగాత.

---

# ద్రౌపదీదేవి

పాంచాలదేశంబున ద్రుపదపురంబు రాజధానిగాఁ జేసికొని, ద్రుపదుఁడను భూపాలుండు రాజ్య మేలుచుండెను. కొండొక కారణమున, నా ధరావల్లభుఁడు ద్రోణునిచేఁ బరాభవింపఁబడి ద్రోణునిఁ

జంపగల పుత్రుని, ద్రోణ శిష్యులలో పేరుమోసి, యిప్పటి రాజచక్రంబు ముందర, మిగుల పరాక్రమవంతుఁడని ఖ్యాతిగాంచి కుంభజుని ప్రేరేపణచేఁ దనను జయించిన యర్జునుని భర్తగాఁ బడయుఁదగిన పుత్రికను గనవలయునని పురోహిత సహాయమున నొక్కయాగము ప్రారంభించెను. దైవానుగ్రహంబున సాజన్నము పూర్తియగుటచే నా యగ్నినుండి యస్త్రశస్త్రములు హయసమన్వితంబగు రథంబును కలిగి కవచకుండలములతో నొక్కకుమారుఁడు, సౌందర్యరాశియై మహాశక్తి యవతారమాయను భ్రమకలుగునంతటి పరాక్రమశీలయునగు నొక పుత్రికయు సంభవించిరి. అంతట ద్రుపదుఁ డా కుమారునకు ధృష్టద్యుమ్నుఁడని నామకరణ మొనరించెను. యజ్ఞకుండమున జన్మించిన కతంబున యాజ్ఞసేని యని పుత్రికకు పేరిడి యల్లారుముద్దుగా బెంచుకొనుచుండెను. యాజ్ఞసేని దినదిన ప్రవర్థమానయై తన సుగుణగణములచేఁ దల్లిదండ్రులకు సాటి రాచబందుగులకు సంతోషమును జేయుచుండెను. పాండునందనులు కౌరవులు కారణాంతరమున పరస్పర భేదము కలవారలయి యుండిరి. సుయోధనాదులు వారణాసీపురంబున లక్కయిల్లొక్కటినిర్మించి పాండవుల రూపుమాపఁదలఁచి గూఢముగాఁ దత్ప్రయత్నము కొనసాగించిరి. కాని యా ప్రయత్నము విదురునివలన భీముడెఱిఁగి యర్ధరాత్రంబున నా యింటిలో నిర్భయముగా నిద్రించుచున్న సోదరులను, కుంతీదేవిని యెత్తుకొని రహస్యమార్గంబున నా యింటినుండి బయలుదేరి యా గృహంబునకు చిచ్చుముట్టించి దుర్గమారణ్యంబున హిడింబుడను రక్కసుని ముక్కలుగావించి తనను కామించిన హిడింబినిఁ దీసికొని ఘోరారణ్యమునఁ జేరెను. తెల్లవారినపిమ్మట పాండవులు, కుంతియు, భీముని సాహసమునకు మెచ్చుకొని యచ్చెరువందుచుండ వ్యాస మహర్షి చనుదెంచి పాండవులు కుంతీదేవితో నశించిరని లోకమున కింవాద బయలుదేరినది, కొన్నిదినములు మీరు ప్రచ్ఛన్నులై యుండుట మేలని యుపదేశించి చనియె. వారి యానతిచే నరణ్యములు దిరిగి తుట్టతుదకు నేకచక్రపురాగ్రహారమున బ్రాహ్మణ వేషధారులయి మధూకరవృత్తిచే జీవించుచుండిరి. భీముండా యగ్రహారము

బకాసురుని బాధకు లోనైయుండుట నెఱింగి వానిని తన సహజ బలముచే చంపివేసి లోకోత్తర ఖ్యాతిగాంచెను. పాండవులు నశించి రనువార్త ద్రుపదుఁడాలించి తనకోరిక నెరవేరకపోయెనుగదా యని చింతిలుచుండెను. అర్జునుని సౌందర్యాదులను విని మానసమునఁ బ్రేమించిన పాంచాలియు మానసంబున నించుకంత విచారము కలిగి నను సహజ గాంభీర్యయగుటచే దానిని లోలోపల నిముడ్చుకొని కాలము గడుపుచుండెను. బకాసుర వధానంతరము చారులచేఁ జూచాయగాఁ బాండవులు ప్రచ్ఛన్న వేషధారులయి యేకచక్రపురంబున జీవించియున్నారని ద్రుపదుడెఱింగి, వారిని గుర్తెఱుంగు నుపాయము యోచించి ద్రౌపదీ స్వయంవరంబు సాటించె. నా స్వయంవర వార్తనెఱింగి వివాహోచిత వేషధారులయిన రాకుమారులు వేనవేలు సభ నలంకరించిరి. ఆవేడుకఁజూడ పలువురు బ్రాహ్మణోత్తములు చనుదెంచిరి. వారితోఁగూడ బ్రాహ్మణవేషధారులయిన పాండవులు స్వయంవరమండప మలంకరించిరి. దుర్యోధనాదులు కృష్ణభగవానుఁడు చనుదెంచిరి. ద్రుపదుడు సభామధ్యమున నొక్క కొలను కల్పించి, దాని మధ్యభాగమున మింటనొక యంత్రమత్స్యము ప్రేలాడఁ గట్టినాడు. దానినీడ నీళ్లయందు ప్రతిఫలించుచున్నది. తానొక ధనువును అయిదు బాణములను సభాప్రదేశమున నుంచినాఁడు విలువిద్యయం దారితేరినవారెవ్వరేని, కొలనిలోఁ బ్రతిఫలించిన నీడనుచూచి మింటి మత్స్యమును తానిచ్చిన వింటితో నయిదుదెబ్బల లోపుగా దెగఁ గొట్టినచో నా వీరుని యాజ్ఞసేని చేపట్టునని ప్రకటించెను. స్వయంవరోచిత వేషధారియై చతురంతయాన మధిరోహించి, సఖీపరివృతయై యాజ్ఞసేని సభాస్థలి కరుదెంచినది. రాజుల నేత్రములను తుమ్మెదలు ద్రౌపదీ ముఖపద్మముమీఁద నొక్కమారు ముసురుకొన్నవి. సౌందర్యమను తేనెను గ్రోలుచున్నవి. వెనుకకు మరలఁజాలక పోయినవి. యా లావణ్యప్రవాహవీచిడోలికల నుయ్యాల లూగసాగినవి. యూగి యూగి యలసి సొక్కిపోయినవి. మంగళవాద్యములు ప్రారంభమయినవి. స్వస్తిపుణ్యాహవాచనములు జరిగినవి. రాకుమారు

లలో సకిలింపులు, మీసములు దువ్వటలు, బుజము లెగరవేయుటలు, బొమ్మ విరుచుటలు, మోకరించుకొని కూర్చుండుటలు, ఆలీఢ ప్రత్యాలీఢాది వ్యాయామామ్నానములు యేమేమో ప్రారంభములయినవి. ఒక్కరొక్కరే బయలుదేరినారు. శరాసన మెత్తలేనివారు, నారినిఁ గూర్చలేనివారు, శరసంధానముతో స్వస్తి చెప్పినవారు, వింటితోఁగూడ సభకు సాష్టాంగ మొనరించి లేచుటకు పరుల సహాయ మపేక్షించినవారు, నీవుపద, నీవుపద ముందుగానని బుజములు గోకువారు, కనుసంజ్ఞలు చేయువారు అందఱు దాదాపు వింటికి నమస్కరించినవారలయిరి. దుర్యోధనాదులు, కర్ణుని మీఁద నాశఁబెట్టుకొనిరి. ఆముచ్చటఁగూడ పుడమిఱేఁడులెల్లరుచూడ వేడుక పడుచుండిరి. యొకరినిజూచి మఱియొకరు తమ పరాభవముల మరువసాగిరి. అందఱు యేకీభవించి ద్రుపదుని పరాభవించఁ జూచుచుండిరి. తుట్టతుదకు యాజ్ఞసేని సూత పుత్రుని వరించక తప్పదని నిశ్చయించినారు. కర్ణుఁడు లేచినాడు. ద్రౌపది కృష్ణమూర్తిని జూచినది. కృష్ణపరమాత్మ భక్తురాలి యభిప్రాయముకని పెట్టినాఁడు. యభయహస్తము చూపించినాఁడు. ద్రౌపది యానందాశ్రువులు రాల్చినది. కర్ణుఁడు మఱియు నుత్సాహ పూరితుఁ డయినాఁడు. ద్రుపద దత్తమగు ధనువును సమీపించినాఁడు. బంతివలెనెత్తి నారి గూర్చినాఁడు. శరసంధాన మొనర్చి లక్ష్యశుద్ధియందలి నైపుణ్యము ప్రదర్శించుచు, యాజ్ఞసేని ముఖారవిందము చూచి యోరచూపులు నిగిడించినాఁడు. పుష్పహారము గ్రహించ వేమి యనునట్లు కనులు త్రిప్పినాఁడు. మోకరించి కూర్చున్నాఁడు. సభ్యులందఱు ద్రౌపది కర్ణుని సొమ్మేయని, సిద్ధాంతము చేసినారు. చెలికత్తె పూలమాలిక రాకుమారి చేతి కంది యిచ్చినది. రాధా తనూజాతుఁడు సుయోధనునిఁ గాంచినాఁడు. యంత్రమత్స్యముమీఁదికి బాణమువదలినాఁడు. నువ్వుగింజ పరిమాణము తప్పినది. సభవారు చప్పటులు గొట్టినారు. కర్ణుని మానసోత్సాహముతో గూడఁ జేతినుండి విల్లు జారి పడినది. సుయోధనాదుల మోములఁ గత్తివాటిడిన రక్తములేనట్లు కనఁబడుచున్నవి. రాజులందఱు, ద్రౌపది బ్రహ్మచర్య వ్రతము నవలంబించు

నన్నారు. రాజులను పరాభవించుటకు ద్రుపదుఁడు పన్నిన పన్నాగ ముగాని వేరొండు లేదని సిద్ధాంతము చేసినారు. ధృష్ట ద్యుమ్నుఁడు రాజచక్రమును గాంచి, భరతదేశమందలి రాకుమా రుల లక్ష్యసిద్ధి సరిపోయినదిగదా నేఁటికి. యనినతోడనే వీరాధి వీరులు సమరసన్నాహులు లయినారు. సభాంగణము రణాంగముగా మారిపోవనున్నది. గాండీవి కృష్ణపరమాత్మకు శిరస్సువంచినాఁడు. అన్నగార్ల పాదములకు మ్రొక్కినాఁడు. కొల్లాయిగుడ్డ నడుముకు బిగియించినాఁడు. బ్రాహ్మణసముదాయమునుండి లేచివచ్చి కృత్రిమ సరోవర సమీపమున బాణాసనము సమీపించినాఁడు. గోపాలు లందఱు పక్కున నవ్వి చప్పటులు కొట్టినారు. యెత్తవచ్చును దర్భ కట్ట, ఆ కౌదు- ఉద్ధరిణ, అబ్బె పప్పుముద్ద, అరె, గారెముక్కరా యని కొందఱు రహస్యముగా మరికొందఱు వినఁబడి వినఁబడనట్లు చిలుకపలుకులు ప్రారంభించినారు. కన్గుడీరూపము చూచినతోడనే పాండవమధ్యముని జ్ఞాపకము చేసికొనినాఁడు. కాని చచ్చినవాఁడెట్లు వచ్చునాయని నిరాస చెందినాఁడు. ద్రౌపది మోము వెలవెలబారి నది. నిజముగా బ్రహ్మచారిణియగు వ్రాతవ్రాసినది కాఁబోలునని తలంచుచు నందనందనునివంకఁ జూచినది. చిఱునవ్వు మోసలెత్తు మోముదమ్మిని పార్థునివైపునకుఁ ద్రిప్పి విజయమందుమని మనసా దీవన నొసంగినాఁడు. సభానమస్కారముచేసి, గురుస్మరణగావించి కందుకమువలె బాణాసనమెక్కువెట్టె విలాసముగా బాణము వదలి నాఁడు. మొదటిదెబ్బకే యంత్రమత్స్యము పుటుక్కున తెగినది. పెళ్లుమని విల్లు విరిగినది. జల్లుమని సుయోధనాదుల గుండెలు జారి నవి. గొల్లుమని బ్రాహ్మణుల మధ్యనుండి యులివు బయలుదేరినది. గల్లుగల్లుమని మంజీరములు ధ్వనించుచుండ యాజ్ఞసేని చనుదెంచి బ్రాహ్మణశ్రేష్ఠుని మెడలోఁ బూలహారము వైచినది. పురోహితు లాశీర్వదించినారు. మంగళవాద్యములు భూమ్యాకాశములు బూర టిల్లఁ జేసినవి. ద్రౌపది కరంబు స్వీకరించి విజయుడు వైదిక బ్రాహ్మణ వేషధారియగు ధర్మజు చెంత నిలిపినాఁడు. రాజులందఱు మాత్సర్యమువహించి కర్ణప్రభృతులతోఁ గలిసి, పోరాడ సాఁగి

నారు. పాండవులఁ దీసికొని ద్రుపదనందనతోఁ గూడ నీ సందడిలో కృష్ణమూర్తి మటుమాయమయినాఁడు. అర్జునుఁడు గాండీవమాత్ర సహాయుఁడై యెదిరించిన రాజచక్రము నంతయు దూదిపింజవలె నెగురఁగొట్టినాడు. కర్ణుఁడా తూపులు నేరుపుమీర వదలుట సవ్యసాచితనము వీనియందు గలదనియు నాకుఁ బ్రతిద్వంది భూసు రుండు కలండని, నిర్ధారణ సేసికొని వృథా కలహము భూసురునితోఁ దగదని వెలువరించుచు సుయోధనాదులతో నింద్రప్రస్థము జేరి నాఁడు. బ్రాహ్మణు లన్నివిద్యలలోను మిన్నఁగా నున్నారని లోలోపల మునమునలాడుచు తక్కిన రాజులు వచ్చినత్రోవను ద్రౌపదీ సౌందర్యమును, బ్రాహ్మణుని వింటినేర్పును, స్మరియించుకొనుచు లేటమొగములతో వారివారి గృహంబుల కేగిరి. ద్రుపదుఁ డీవింత జూచి, ద్రౌపదిని స్వీకరించినవారు బ్రాహ్మణులా? లేక క్షత్రియులా? లేక యన్యజాతీయులా నిశ్చయింపఁజాలక, గూఢచారుల నా బ్రహ్మణనివాసము లారసిరండని మారువేషములతో పంపినాఁడు. కృష్ణపరమాత్మ పాండవులకుఁ జెప్పవలసిన రహస్యములఁ జెప్పి ద్వారక కేగినాఁడు. ధర్మనందనుఁడు ద్రుపదపుత్రిని తండ్రి శుద్ధాంత మున కనిపి తమ నివాసము చేరినాడు. క్రమముగా పాండవులందరు తమ నివాసగృహము చేరినారు. పార్థుఁడు కుంతీదేవికి నమస్కరించి తల్లీ నేఁడొక ఫలంబు సంపాదించితినని నమస్కరించినాఁడు. కుంతీ మహాదేవి నాయనా మీ రయిదుగురు సమానముగా ననుభవించు డని యాజ్ఞ నిచ్చినది. పతివ్రత నోటినుండి వెడలిన మాట త్రిప్పు టకు మువ్వురు సమర్థులుకారు. అనంతర మా ద్రౌపదీ వృత్తాం తము కుంతీదేవి వినినది. పశ్చాత్తాప, పరీత చిత్తయయినది. దైవ విధియెట్లుకానున్నదో యెవరుచెప్పఁగలరు. విధిననుసరించి, కర్మలు మారుచుండును. పతివ్రతల మాటల ననుసరించి, కర్మలు మారుచుండును. రెండు మూఁడు దినములు గడిచినవి. ద్రుపదుని గూఢచారులు పాండవాన్వేషణము సలిపినారు. ద్రుపదున కెరింగించి నారు. వారి నిజమును గ్రహించ బ్రయత్నమును సలిపి సిద్ధాంతము చేసి యనుభవములోనికిఁ దెచ్చినారు.

బ్రాహ్మణ, క్షత్రియ, సమారూఢార్హ మయిన రథములు పాండవ సన్నిధానంబునకు వివాహ శుభలేఖలతోఁగూడఁ బంపినారు. కుంతీ సహితులయిన పాండవులు క్షత్రియారోహణ సముచితము లయిన తేరుల నధిష్ఠించినారు. పాంచాలపురము చేరి, ద్రుపదుని చే సత్కారము లందినారు. చూపిన విడదులయందు దిగినారు. కుంతీ మహాదేవి వ్యాస తపోధనుని మనసా ధ్యానించినది. ప్రత్యక్ష మయినాఁడు. ధర్మరాజాదులీ సందియము నాని ముందరఁబెట్టినారు. ఇంతలో ద్రుపదుడు పురోహిత సహితుఁడై మహావీర బ్రాహ్మవేష ధారుల యింటికి వచ్చినాఁడు. వ్యాస పాదసేవా పరాయణులగు పాండవ పంచకమునుచూచి పాంచాల ప్రభువరేణ్యుఁడు సంతో షముతో మిన్ను ముట్టిపోయినాడు. అర్జునుని పాణిగ్రహణమున కాహ్వానించినాఁడు. పెద్దవాఁడగు ధర్మ, భీముల పరిణయమైన పిమ్మటగాని వలనుపడదనియు, కుంతీదేవి పలికినమాట యనృతము కాకూడదనియు, వ్యాస భట్టారకుఁడు వచించి ద్రౌపది పూర్వ వృత్తాంతము స్వల్పముగా బోధపరిచి ద్రౌపదిని పాండవుల కైదు గురికి, యథావిధి కన్యాదానము చేయించినాఁడు. దేవతలు కుసుమ వర్షము కురుపించినారు. ద్రౌపది పాండవ ధర్మపత్ని యయినది. అనంతరము ధృతరాష్ట్రుఁడు పాండవులు జీవవంతులయి యున్నా రనియు పతివ్రతాశిరోమణి యాజ్ఞసేనినిఁ జేపట్టినారనియు విని తగు నీతిపరులఁ బంపి సబహుమానముగా రప్పించి కొంతకాలము తనవద్ద నుంచుకొని సుయోధనుని ప్రేరేపణచే నింద్రప్రస్థమునకుఁ బంపబడి కాలము గడుపుచుండిరి.

ఇట్లుండ నారదుండరుదెంచి పాండవాగ్రజునితో నిందువేరోల గంబున మయదత్తంబైన సభయందు కుశలంబునడిపి లోకపాలక సభావర్ణనలుగావించి ముల్లోకములయందు నిట్టి దివ్యసభాసదనంబు లేదని వక్కాణించి ప్రసంగవశమున రాజసూయాధ్వరము సలిపి తనకు స్వర్గలోకవాసము చేకూర్పుమని పాండుభూపాలుఁడు ధర్మ నందనునితో వచియించుమని చెప్పినట్లు చెప్పి నారదుఁడు యథేచ్ఛం జనియె.

అంతటఁ గృష్ణానుమతంబునను వాని సహాయముచేతను జరాసంధాదుల వధించి మితిలేని ద్రవ్యమార్జించి, ఎన్నడు ఎవ్వరు చేయని వైభవముతో యథాశాస్త్రీయముగా రాజసూయాధ్వరము పూర్తి జేసి యగ్రపూజా సందర్భమున శిశుపాలవధతో నవభృథ స్నానమాచరించి జన్నమునకు వచ్చిన బంధుకోటిని సాగనంపెను. సుయోధనుఁడుమాత్రము మయసభా విలోకనార్థము కొన్నిదినము లాయూర విడిదలలోనుండి మయసభారహస్యముల సావకాశముగాఁ జూచుచుండెను.

అట్లు చూచుచున్న సమయమున, మయుని నిర్మాణకౌశలముచే జలప్రదేశము స్థలమయంబుగను, స్థలప్రదేశము నీటిమయంబుగను, వివృతద్వారము సంవృతద్వారముగను, సంవృతద్వారము వివృతముగను గనుపట్టుటచే సభాభవనమునఁ బిచ్చివానివలె దిరుగుచు నొక్క నీటిమడుగులో దిగబడినాఁడు. సఖీపరివృతయగు ద్రౌపదికి దుర్యోధనుని పరాభవము కనుపడినది. సుయోధనుఁడు సిగ్గు పడినాడు. దుర్యోధనుండు పాంచాలిపైయీర్ష్యాసూయాదులు పెంచి, మయసభనుఁజూచి యోర్వలేనితనమున మనమునఁ బొగలుచు, నెట్టులోఁ దండ్రిని మెప్పించి, నూతన సభాప్రవేశ మహోత్సవ సమయమునఁ బాండవుల రావించి, శకుని ప్రేరణచే మాయాద్యూతపు కొలువులోనికి ధర్మజుని దింపినాఁడు. కపటద్యూతంబున ధర్మజుఁడు రాజ్య సర్వస్వమును, సోదరులను, ద్రౌపదిని పందెము పెట్టి యోడిపోయినాఁడు. సుయోధనుఁడు ద్రౌపదిని మానభంగము గావింపఁ బ్రయత్నించినాఁడు. విదురుడు ధర్మోపదేశముల గావించి నాఁడు గాని యవి దుర్యోధనునియందు, చవిటిపఱ్ఱను నాటిన విత్తనము లయినవి. దుశ్శాసనునిచే శుద్ధాంతవాసిని యాజ్ఞసేని జుట్టు పట్టి సభలోనికి తీసికొని రాఁబడినది. సభామధ్యమున హా హా కారములు చెలరేగినవి. ద్రౌపది భర్తలవంకేఁ జూచినది. భర్తలు ద్యూతనిర్జిత దాసులయినారు. ద్రౌపదిని కాపాడలేకపోయిరి. భీముఁడు కన్నులురిమి యన్నను చూచి న్యాయవిహీనకార్యము సహింపజాలక తమ కిట్టికష్టములు లభింపఁజేసిన, ధర్మజునిపై, కోపముసూపి యాచెయ్యి

కాల్చ యత్నించినాఁడు. సోదరుని యనునయముచే కోపముశమింపఁ జేసికొని, సిగ్గుచేఁ దలవంచుకొని, కోపము నిముడ్చుకొనఁజాలక, యుద్ధభూమిని దుశ్శాసనుని ఱొమ్ము బ్రద్దలగొట్టి, మూఁడుదోసెళ్ళ రక్తము ద్రావెదనని ప్రతిజ్ఞఁజేసెను. సభయంతయు భయోద్రేకముచే చీకాకుగా నున్నది.

ద్రౌపది యనన్యగతిక యయినది. కర్ణప్రేరేపణచే దుర్యోధనుని శాసనంబున, దుశ్శాసనుండు ద్రౌపదిని వివస్త్రను జేయ సమీపించినాఁడు. మహావీరులు, శూరులు సభలో నిండియున్నారు. యీ యకార్యము చూచుటకు సహింపలేక, ప్రభు శాసనము దాఁటలేక, భయ, క్రోధ, రోషోత్సాహముల చేత త్రోపుడు పడుచు, యేమియు చేయలేక, ప్రత్తికాయలవలె గ్రుడ్లు వెళ్ళఁ బెట్టుకొని, ప్రత్తిరాట్నములవలె చెవులు దోరగిలఁ బెట్టుకొని గుడిమీఁద బొమ్మలవలెఁ గూర్చున్నారు. యిది తగదని ప్రభువు ముందఱఁ దెగఁబడి చెప్పుటకా పట్టుడు పొట్టకూటి కెక్కడ భయము కలుగునో యనుచు వాజమొగములు వేసికొని పతివ్రతా పరాభవమును చూచుటకు సంసిద్ధులయి చిత్రప్రతిమలవలెఁ గొందరు గూర్చున్నారు. భీష్మాదులు సమర్థులయినను దుష్టప్రభులకు సామోపాయముచేత నెంత బోధించినను ప్రయోజనము లేదని మౌనము వహించినారు. అధర్మము అవమానము తమకనులతోఁ జూడలేక ప్రభువు కోపమునకు జంకక న్యాయప్రతిష్ఠకై ప్రాణములఁ దారబోయ సంసిద్ధులగు విదుర వికర్ణాదులు నిష్పక్షపాతముగా ద్రౌపదీ మానభంగ ప్రయత్నము సుయోధన వంశనాశనమునకు దవాలన ప్రాయమని ఘంటాపథముగాఁ జెప్పినారు. సభాభవనమంతయు ప్రళయవాయు సంచారముచే చపలభావము వహించినది. ద్రౌపది యొక్కతయే యగౌరవప్రళయమునకుఁ గురికావలసిన దయినది. ఇట్టి మానభంగము భర్తలయెదుట నెప్పుడుగాని, యే స్త్రీగాని, యెక్కడగాని పడియున్నదని యే పురాణములలోగాని విని యున్నారా? లేదు వినలేదు. ఆడుదానికి నపూర్వ మానభంగప్రళయ మిదియే సృష్టిలో ప్రారంభము. సభాసదులందఱు వీరులు. ఒక్కొక్క

ప్రపంచమును పరిపాలింపఁదగిన శూరులు. మనీషావంతులు సమయము వచ్చినపు డొక్క యాడుదాని వస్త్ర మూడఁదీయుట కొక్క పశుప్రాయుడు సభలో ప్రయత్నించుచుండ, వలదని వారింపఁగలిగిన మగవాఁడు కలికమునకైనఁ గానరాలేదు. ద్రౌపది మ్రొక్క దిక్కు లేదు. మానరక్షణమా, ప్రాణరక్షణమా పరిధానము. తప్పించుకొని పోవుటకు వీలులేదు. ఋత్విక్కులచేతినుండి యజ్ఞపశువు తప్పించుకొని పోవుట కవకాశమున్నదా? లేదు. సుయోధనమహారాజు మానవతీ మానభంగ మహాయజ్ఞ మధ్యమున కర్ణ దుశ్శాసనులకు యాజ్ఞసేనీ మానభంగమునకై పేరిమ యిచ్చినారు. పరికరములు సిద్ధముచేసికొని ఋత్విక్కులు సిద్ధపడినారు. ద్రౌపది స్త్రీ స్వాతంత్ర్యమన నేదియో తెలిసికొనినది. పెనిమిటికి భార్యపైగల యధికారము గుర్తించినది. ద్యూతమందు దాస్యమునకు విక్రయించు ధర్మజుని మాటప్రకారము తన జీవితము, గౌరవము ప్రతికక్షుల స్వాధీనము సేయఁదలఁచినది. వివస్త్రయయి సభలో నిలువఁబడక తప్పదనుకొనినది. స్త్రీలకు భూషణమగు లజ్జ వస్త్రముతో కూడ విడువవలసినదిగా సిద్ధాంతము చేసినది. మానభంగము కాకుండ తన యాత్మశక్తిచేఁ గాపాడుకొనఁగలనని నిశ్చయించుకొనినది. పాతివ్రత్యధర్మము స్త్రీల నుద్ధరించునని త్రికరణముల నమ్మినది. తొల్లి పార్వతి తన పాతివ్రత్య ధర్మముచే హాలహాలము మ్రింగిన తన భర్తను శంకరుని కాపాడుకొనినదని జ్ఞాపకము చేసికొనినది. పరమాత్మా! జగత్తులు ధర్మసూత్రమునఁగదా కట్టుబడినవి. అట్టి ధర్మములలో నొక్కటియగు పతిసేవ నేను చేయుట నిష్కల్మషహృదయముతో నేను చేయుట నిక్కమైన, నా పరాభవము పంచభూతములు, సూర్యచంద్రాదులు, మహేంద్రాదులు, త్రిమూర్తులు, పరాశక్తి నీవు యింతమంది సహించెదరా? యని హృదయపీఠమున పతిభక్తిసూత్రముచే శ్రీకృష్ణపరమాత్మ నాకర్షించి స్థాపించినది. నిమీలితనేత్రయైనది. ద్రౌపది పరాశక్తి యయినది. సూర్యకిరణములవలె నామె ముఖమునుండి దివ్యమయూఖములు వెలువడసాగినవి. ఆ వెలుగులముందర సుయోధనాది యాతతాయి జనముల నేత్రగోళములు తిరుగుడుపడ సాగి

నవి. అస్వస్థచిత్తు లయినారు. దుశ్శాసనుడు ద్రౌపదిని సమీపించు టకు జంకియు ధైర్యము వహించి దగ్గరకుఁబోయి కేశపాశము చేతికి మెలివేసికొని కట్టుబట్ట నూడఁదీయ ప్రయత్నించినాఁడు. ద్రౌపది చిత్రప్రతిమ యయినది. కాని దివ్యగానము మాత్ర మొండు బయలు దేరినది. ఆ గాన వాయువులచే సభయంతయు, మూర్ఛాసముద్ర మున మునిగినది. వారికనులకు ద్రౌపదియే కాదు, ప్రపంచమే కను పడుటలేదు. పరిషద్రంగము చిత్రరంగమయినది.

సత్యా రుక్మిణీ సమేతుఁడయి పాచిక లాడుచు, అక్షయ మని పందెము వైచినాఁడు. కృష్ణుని భార్యలిద్దరు, ఇది యేటిపందెమని వాసుదేవుని యడిగినారు. ఇటుచూడుఁడని కనులు తుడిచినాడు, కృష్ణపరమాత్మ. రాజసూయమునకు కృష్ణుడు చనినప్పుడు, సుదా మునఁడిచ్చిన చెఱుకుతుంటెను కృష్ణుడు చిన్నకత్తిచేఁ జెక్కుచుండఁగా వ్రేలు తెగుటయు, రక్తము స్రవించకుండ, విలువగల తన చీరను చించి తనయెదుట ద్రౌపది, కృష్ణునికిఁ జుట్టుటయు, కనుపడినది. మఱియు నా ముక్కునుండి, దివ్యవస్త్రములు వేనవేలు పుట్టుచున్నవి. సత్యభామ విరాకుపడి చూచుచున్నది. ఆ నాటకము ముందర, నాటమూట జ్ఞాపకములేదు. ఆట కట్టుముడికివచ్చినది.

ఇంక రుక్మిణి, ద్రౌపదిని దుశ్శాసనుండు వివస్త్రను చేయగా బట్టల నూడఁదీయుటయు, తరుగని వస్త్రములు, ఆమె నడుమునుండి వెలువడుటయు చూచినది. మఱియు, నా చీరలు కృష్ణపరమాత్మ చిటికెనవ్రేలి గోటినుండి కోటానుకోటులు బయలుదేరి, ద్రౌపది శరీరములో లీనములగుచున్నవి. యీ చిత్ర ప్రదర్శనముచూచి రుక్మిణీదేవి యచ్చరువుతో తానాడు పాచికలయాట జ్ఞాపకమురాక, పాతివ్రత్య మాహాత్మ్య నాటక ప్రదర్శనమును దివ్యదృష్టి ప్రదర్శన మును చూచుచున్నది.

హాస్తినాపురిలో దుశ్శాసనుఁడు ద్రౌపది కట్టుగుడ్డలు లాగ ప్రారంభించినాఁడు. వేనవేలు చీరలు మొలనుండి బయలుదేరు చున్నవి. విప్పినగుడ్డలు పర్వతాకృతు లయినవి. అన్నియు దివ్య వస్త్రములే. భూలోకములో చూడనివి. కౌరవులభార్యలు జాలకట్టల

నుండి యాజ్ఞసేనీ మానభంగ మహోత్సవ నాటకము చూచుచు, నామె కట్టి విడిచిన బట్టలను కట్టుకొనుటకు నాసపడి నౌకరులచేఁ దెప్పించుకొని, కట్టుబట్టలను విప్పి దివ్యవస్త్రములను ధరించినారు. క్షణములో నాబట్టలు వారి మొలనుండి మాయమయినవి. వివస్త్రులయి నారు. పాపమా సంగతి వారికి దెలియదు. వారి కనులకు బట్టలు కనఁబడుచున్నవి. చూచువారికి వివస్త్రులుగాఁ గనుపించుచున్నారు. చెరపకురా చెడెదవు అను నీతి ప్రత్యక్షానుభవమునకు రాక మానునా? ఉత్పాతము లనేకములు పుట్టినవి. అగ్న్యగారమున త్రేతాగ్నులు చల్లారినవి. ద్రౌపదీ మానభంగసంభూత విషవాయువులు కౌరవుల మూర్ఛితులగుచు వివస్త్రులయి సభాంతరాళమున కౌరవపత్నులు మానము గోలుపోయినారు. విదురుని ద్వారా ధృతరాష్ట్రు డీవార్తవిని ద్రౌపదిని, పాండవులను దగ్గరకు తీసికొని ద్రౌపదీ వరరూపముగా పాండవుల దాస్యములనుండి విడుపించి, సుయోధనునకు ద్రౌపదీ సాధ్వీప్రభావము బోధించి యానాఁడు సభ చాలించెను. కాని దుర్యోధనునకా క్రౌర్యము పోవలేదు. ధర్మజుని తిరుగాఁబిలుపించి పదిరెండు వత్సరములు(12) అరణ్యవాసము ఒక వత్సర మజ్ఞాతవాసము చేయు పందెములతో దుర్యోధనుడు శకునిచేత మాయాద్యూత మాడించి, ద్రౌపదీసహితముగా పాండవుల కానలపాలు గావించినాడు. అన్న యానతిచొప్పున సోదరులు వారి ననుసరించి పాండవపత్నియు నడవులపాలయి కాలము గడుప సాగిరి. విధి బలవంతమయినపుడు పరాక్రమాదులు పనికిరావుగదా.

ఇట్లు పాండవులు ద్వైతవనంబున కొన్నిదినములు కామ్యక వనంబునఁ గొన్నిదినములు మార్కండేయాది మునులవలన ధర్మములు వినుచు కాలము గడుపుచుండిరి. అరణ్యముననున్న పాంచాలిని పరాభవించి, దుర్యోధనునికి మెప్పు చూపవలయునని సైంధవుడు పాండవులు లేనితరిని ద్రౌపదిని సమీపించి బలాత్కారముగా మానభంగము కావింప యత్నించెను. అప్పుడు ద్రౌపది పతివ్రతా ధర్మసహాయమై నిలువబడి పోరాడి శాంతసమరముతో చురుకు చూపులు సైంధవునిపై నిగుడించెను. ఆ చూపుతూపుల తాకునకు

నెత్తివాఁడై రథముపై బడెను. అనంతరము పాండవులు వానినింబట్టి శిరోముండనము గావించి పాండవదాసు ననిపించి వదలివేసిరి. అరణ్యమున ద్రౌపది పతిసేవా పరాయణయై తమతోఁ జనుదెంచిన పౌరులకు, అతిథులయిన మునులకు, నిత్యము వంటకముచేసి భోజనం బిడవలసిన బాధ్యత యామెయందె యున్నది. ఆగంతుకమయిన, యైశ్వర్యము, అవాంతరముగాఁ జనుదెంచిన దాస దాసీజనంబులు, మేడలు, మిద్దెలు, రాణివాసమునఁ గలుగు సౌఖ్యములు ద్యూతపు విషవాయువులచే బుట్టిన చీడపురువు తినిపోయినది గాని సహజ ధార్మికగుణ మా పాండవులయందుగాని యాజ్ఞసేనియందు గాని చివుకువెట్టుట మానలేదు. మండు వేసవి వడగాలుపు, మామిడి చిగురులకు, మల్లెపూవుకు కోమలమును, సువాసనఁ బెంచుచుండుట లేదా? అట్లనే పాండవ గార్హస్థ్య లక్ష్మి ద్రౌపది నిత్యము భర్తలు కాంతారంబునఁ దెచ్చు దుంపలు, కాయలు, ఆకులు పచనముసేయు టకు దగిన భాండములు మొదలయినవి లేకపోవుటచే నొక్కనాఁడు, ప్రొయ్యిలో నొక్కింత యొండుగడ్డి వైచినది. వంటకట్టెయలు సిద్ధముగా లేవు. వానికై భర్తలు ప్రయత్నించలేదు. భర్తలు అగ్రజునితో గూడ మునిచంద్రులవద్ద ధర్మశాస్త్రములు వినుచున్నారు. వారి కంతరాయము కలిగించుట ద్రౌపది కిష్టము లేదు. పక్వక్రియా సాధనోపకరణ కాష్ఠముల కెంతసేపని యెదురుచూచును? పతిపాద ముల మనసా ధ్యానించినది. వేడివేల్పుని తలచినది. తలచుటయే యాలస్యము, మహానసమునందు తనరూపును బయలుపరచినాఁడు. నావంటకంబగు నంతకు, నీ నిజాంకుశమున బ్రజ్వలింపుమని కోరినది. "ఓం" అనినాఁడు. చిన్నభాండ మొండు ప్రొయ్యిమీదఁ బెట్టినది. సూర్యునివంకఁ జూచినది. మాకు వలయు పదార్థములు, వలసినన్ని వలయునపుడెల్ల నక్షయముగా నీ భాండముల నిండ, నీవసుకిరణములచే నింపవలయుననినది. కాదనుటకు నెవరు సాహ సింతురు. ఆమె కోరచూపు తూపు లెవరు సహింతురు? ప్రాణ ములమీఁద నాసఁ జెందనివారేకదా? యంబరమణి ముదల యని తలయొగ్గినాఁడు. సతీమణికి లోఁబడని వేల్పు లెవరు?

సృష్టియంతయు నామె యధీనమే. నిత్య మీతీరుగనే పాకము సిద్ధచేయుచున్నది. కాంతారవాసము కమనీయముగా నడుచుచున్నది. ఆమె వంటకమూ భుజించువారు నిత్యము పదివేలమంది.

అంతట నొక్కనాఁడు సుయోధనప్రేరితుఁడై దూర్వాస మహాముని పదివేలమంది శిష్యులతో నతిథిగాఁ జనుదెంచినాఁడు. పాండవ గృహలక్ష్మి కూడ భుజించినది. ధర్మనందనుఁడు దూర్వాసోబుుషి కెట్టు లతిథిసత్కారము చేయుదునా యని మానసమున భీతిపడు చున్నాడు. వంటయింటిలోనికి వచ్చి గృహలక్ష్మి కీవార్త నెఱిగించి ఋషిసపర్యల కరిగినాఁడు. అత్రినందనుం డకాలమయినది. మాధ్యాహ్నికక్రియ లిందె నిర్వర్తించెదమని శిష్యసమేతుఁడయి స్నానాది మాధ్యాహ్నిక కృత్యముల నెరవేర్చుకొనం బోయినాఁడు. ద్రౌపది యేమిచేయును? తన యిలువేలుపు కృష్ణపరమాత్మను ధ్యానము సేయుచు క్షణకాలము నిమీలితనేత్రయయినది. దేహము మరిచినది. సోదరా! మాంపాహి యని యప్రయత్నముగా నోటినుండి వెలువడినట్లు వినఁబడుచున్నది. రాధాసహితుఁడయి ద్వారకాపతి వచ్చి, యమ్మాయి యని పిలిచినాఁడు. కన్ను దెరిచినది. పరమాత్మను గాంచినది. అమ్మా! యాకలిగానున్నది తినుట కేమయినఁ బెట్టుమన్నాఁడు. ద్రుపదనందన కనులవెంట బటబట నీరు వెడలసాగినది. రాధారమణి పైటచెంగుచే నొత్తినది. యేమి పిచ్చితల్లి పిరికిదాన వయినావు. నా కేమి కావలయు పప్పులా పాశములా? "శ్లో॥ పత్రం, పుష్పం, తోయం" మరిచినావా? మంచితీర్థ మీయరాదా యని ప్రేమ రసము యధర పల్లవమునఁ జిందు లాడ పలికెను. అందలిరహస్య తత్వ మా పాంచాలి గ్రహించి, అభ్యంగనార్థము సీకరించిన, పండువుసిరక కాయ యొకటి తులసి దళముతోఁగూడ భగవంతుని చేతనిడెను. అక్షయమని యనేక కోటి బ్రహ్మాండములుగల బొజ్జలో పడవేసినాఁడు. రాధారమణి నవ్వినది. ద్రౌపది వేడివేల్పును ధ్యానించినది. మహానసము (పొయ్యి) మండసాగినది. దూర్వాసుడు శిష్యసమేతుఁడయి, యాహ్నికములు తీర్చుకొని ధర్మజాశ్రమమునకు మరలినారు. కడుపులు నిండి

పోయునవి. భుక్తాయాసము ప్రారంభించినది. యెట్టకేలకు ఘటముల నాయాసముతో పర్ణశాలకు చేరవేసినాడు. కృష్ణపరమాత్మ యెదు ర్కొని పాదసేవ చేయసాగినాడు. దూర్వాసు డా చిత్రము గని పెట్టినాడు. భక్తమానసచోర నీవు స్వయముగా చనుదెంచి యీ ఘనకార్యము సాగించితివా యని దూర్వాసుడు ధ్యానైకచిత్తుడై కనులు మూసినాడు. పదివేలమంది ద్రౌపదులు పదివేల యతిథులకు పూజ గావించుచున్నవి అన్నపూర్ణా మహాదేవి, బంగారుగరిటతో వడ్డన సాగించుచున్నది. అమృతకలశ మెదుట ప్రజ్వలించుచున్నవి. అతిథు లానంద సముద్రమున మునిగినారు తేన్చులు మొదలిడినారు. కట్టుబట్టలు సడలించినారు. బొజ్జలు నిమురుకొనుచున్నారు. బంగారు పళ్లెరములనిండ రుచిమూటగట్టినవి. పెకుకలున్నవి. దూర్వాసుడు సిగ్గుపడినాడు. అంబరీష చరిత్ర జ్ఞాపకము వచ్చినది. అయోమయ మయినది. ప్రపంచము సబీభావ మందినాడు కృష్ణా, క్షమించుము సాధ్వీమతల్లీ! పాంచాలి! దర్శనమాత్రము. నూతనసృష్టి కిది యదను కాదు తల్లీ! యదువంశ భూషణుని నీ వొద్దికగావించినది నీపతిభక్తియె. కొలది కాలములో నీ భర్తలు, విజయలక్ష్మి చేతాత్రిం చలప్రసారములకు లోనై సప్తద్వీపము లేకచ్ఛత్రాధిపత్యముగాం జేయు నీ పాతివ్రత్య మహిమకు వందన శతము లర్పించు చున్నానని, కనులు తెరచినాడు. ధర్మజుడు భోజనశాల కరుదేర కై మోడ్పు ఘటించుచున్నాడు. తృప్తోస్మియని. దూర్వాసు డా కౌంతేయాగ్రజుని దీవించి శిష్యులతో గూడ పరువిడినాడు. క్రోసెడుదూర మరిగినను ద్రౌపది యనుసరించి వచ్చుచున్నది. దూర్వాసుడు పాంచాలీ రూపమును చూచి విష్ణుచక్ర మీవిధముగా మారి వచ్చినది కాబోలునని దిగులుపడి, దుర్యోధనునకు సహాయము చేయుట భగవంతునకే వ్యతిరేక కార్యమని నిశ్చయించినాడు. శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించి నమస్కరించినాడు. ద్రౌపదీ పాతివ్రత్యమహిమను కొనియాడి సమాధి దాల్చి భయము వీడినాడు. ద్రౌపది తన సాధ్వీధర్మముచే భర్తలకు నేడుగడయై సకలవిధముల తోడునీడయై యజ్ఞాతవాసమున కీచకుని భీమునిచే జంపించి యనే

కములగు సాయముల చేయుచు తన పాతివ్రత్యమహిమను లోకులెల్ల జనులు చెప్పుకొనుచుండ కృష్ణుడు ముంగొంగు బంగారై, పెట్టని కోటయై, కంటికి రెప్పవలె కాపాడుచుండ కౌరవ పాండవ సమరమున అనేకములగు యోచనలు చెప్పి మంత్రియై భర్తలకు ధైర్యము చెప్పుచు విజయ సామ్రాజ్యలక్ష్మిని తనకు సాపత్నిగాఁ జేకొని కౌరవ వంశనాశనమునకు కాళరాత్రియై, దుర్యోధన వంశాటవీ బడబాగ్నియై, కౌంతేయకులపారావారాభివృద్ధికిఁ గలుములచేడెయై, ప్రజాపరిపాలనా పాండిత్యశేముషీ మనిషులగు భర్తలకు పాండవ వంశాలంకారులగు ధర్మరాజాదుల దేవతాంశలను భూలోకంబున ప్రతిష్ఠించిన సాధ్వీరత్నంబగు కుంతీమహాదేవికి వినయావనతయై శుశ్రూష లొనరించుచు, చుట్టాలపాలిటి సురభియై, యతిథులపాలిటి కమృతఘటికయై, పెద్దలకు తలలోని నాల్కయై, చదువుల సరస్వతియై అంతఃపుర కాంతలలో నాకులలోఁ బిందెయయై, జ్ఞాననిధులలో సులభయై, పరమశాంతనిధియై, ప్రాతఃకాల స్మరణీయయై స్థిరకీర్తి నార్జించి మృతజీవినియై పాంచాలి కృష్ణపరమాత్మయందు మనస్సు చేర్చి పరాశక్తియం దైక్యమయినది. భారతదేశమునందు ద్రౌపది వంటి సాధ్వీరత్నములు వెలయుటకును ఈ చరిత్రమును చదివిన స్త్రీరత్నంబులు సాధ్వులై వెలయునట్లు భగవంతుఁడు ప్రసాదించుగాత.

ప్రథమ భాగము

సమాప్తము.

---

# పార్వతీగర్వభంగము అను

# గంగావతరణము.

గ్రంథకర్త:—సోమరాజు రామానుజరావుగారు.

గుంటూరు బాలమిత్రసభవారిచేతను రంగూన్ ఆంధ్రజాతీయ నాటకసభవారి చేతను ప్రదర్శింపబడి కీర్తిగాంచిన నాటకము. పార్వతీదేవి గంగాపరిసరముల విహరించుచు బహిష్ఠయైయుండి గంగాస్నానమాచరింప నభిలషించెను. గంగానది మానుమని తొలుత హితముపదేశించెను. పార్వతి మాత్సర్యమున వాదమున కియ్యకొనగా గంగాగౌరు లిద్దఱును తగవులాడిరి. గంగ - పార్వతితో నేనే నీకు సవతినై నీభర్త శిరంబెక్కి నీగర్వమడంతునని ప్రతినబూనుట- నారదుడు గంగాపార్వతీ కలహనాటకమును వృద్ధిసేయదలచి పార్వతికి రోషము గల్పించి గంగనుకూడ నోదార్చియామెను విష్ణుదేవునికడకు గొనిపోయి యాతనిపాదములందు దాచుట- భగీరథుడను రాజు తన పితృదేవతలు నరకబాధలందుంచబడిరనియు తత్పరిహారార్థము గంగానదిని భూమికవతరింపజేసినచో గంగాజలంబులు వారిభస్మరాసులపై ప్రవహింప మోక్షమబ్బునని యు నారదునివలన విని గంగను ప్రార్థించుట- గంగ ప్రత్యక్షమై నీవు శంకరుని వేడితివేని యాతని శిరముపై నేనధిష్ఠించి- భూమిపై ప్రవహింతునని చెప్పుట. బలిస్వర్గముపై దండెత్తి విష్ణుమూర్తి దేవతలకు చావురాకుండ అమృతోత్పాదనయత్న మెఱింగించుట- దేవదానవులు క్షీరసాగరమును మథించుచుండ విషము పుట్టుట- దానిని త్రాగి శంకరుడు వెఱ్ఱివాడగుట- విషతాపమున వెఱ్ఱియెత్తిన శివుడు మోహినీయవతారమందిన విష్ణువును చూచి కామించి నారదునకు పార్వతిచెలులనిచ్చి పెండ్లిచేయుదునని ప్రయత్నము చేయుట. పార్వతిచెలులు పిలువవచ్చిన భృంగిని కొట్టి తిట్టి అల్లరిచేయుట- నారదుని వెఱ్ఱిసరసము నవ్వించును. పార్వతివచ్చి పెండి నాటంకపరచుట- (హాస్యరసరంగము) శంకరుడు మోహిని వెన్వెంటబడి యున్మత్తుడై తిరుగుట, పార్వతీ నారదులును మోహినిం బట్టుకొనదలచుట- తుదకు విష్ణువు నిజాకృతిచూపుట. శివుడు విషతాపమున గొట్టుకొనుచుండ గంగ వైద్యవేషమున వచ్చుట- గంగాగౌరీసంవాద మతిరమ్యము. పార్వతి తపస్సుచేసి మగని వెఱ్ఱి మాన్పదలచి- పిండితో విఘ్నేశ్వరుని సృజించి ప్రాణముపోసి, ద్వారముననుంచుట- శివు డది యెఱుగక విఘ్నేశ్వరుని చంపుట- నారదుడును విష్ణువునువచ్చి గంగావతరణమున కనుమతింపుమని పార్వతికి బోధించుట- విధిలేక పార్వతి యనుమతించుట- భగీరథుడు ధ్యానముచేయుచుండగా శివుని జటాజూటమున గంగ యవతరించుట. చక్కని 70 పాటలతోనున్న గ్రంథము అనేకసార్లు ప్రదర్శింపబడినది.

వెల రు 1—0—0.

---

కుఱికూరి సుబ్బారావు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ కృష్ణాజిల్లా.

# భీష్మబ్రహ్మచారి.

(సోమరాజు రామానుజరావుగారు.)

బెజవాడ మైలవరం బాలభారతీసమాజమువారిచే పలుసారులు ప్రదర్శింపబడి పండిత పామరజనులచే నేకగ్రీవముగ స్తుతింపబడి, యెప్పుడు ముద్రింపబడి యాంధ్ర సారస్వతమున కలంకారమగునాయని యెదురుచూచుచున్న భీష్మబ్రహ్మచారి యిప్పటికి ముద్రింపబడినది! మహాభారత శిరోరత్నమును, కౌరవపాండవ పితామహుడును, నిత్యబ్రహ్మచారియునగు భీష్ముని చరిత్రము జన్మము మొదలు మరణమువరకు వ్రాయబడినది. శంతనునకు తన పెంపుడు బిడ్డయగు సత్యవతినిచ్చి వివాహముచేసిన రాజబంధువుడనిపించుకొనిన దాశరాజుయొక్క ప్రభావమును, ఆనాటికి శిఖాపతియు నగు దాశరాజు, "నాకు చాలాకోపమొచ్చింది. మరేమీ!" అని పలుకుచు రంగస్థలమునం బ్రవేశించిన హాస్యఘట్టము మొదలు. మత్స్యకేతనుని సత్యవతీధ్యానవచ్చు దాశరాజు హాస్యరంగములన్నియు మహాద్భుత హాస్యరస పూరితములై దాశరాజు జాలరుపుర రహస్యములను రాజు—రాణి నడుమ బ్రహ్మచారిణి రాణికి ప్రణయాలాపములను, కాశీరాజ స్వయంవర మంటపమున దాశరాజు ఉగ్రాసనమున్నది "ఒక్క నాయాలున్నా మాకేదుర్గా వొచ్చిందా పాపాన్నిపోయినాడా" అని పల్కుటయు, మంత్రి—రాజుపలుకులకుపశ్రుతులుగా ప్రతిమాటకును "అంతే అంతే" యని పల్కుచుండుటయు కడుపుబ్బ నవ్వించుచుండును. గంగాశంతనుల వివాదమునందు యుక్తివాదమును, భీష్మప్రతిజ్ఞయందు గంభీరమయిన పితృభక్తియు—స్వయంవరరంగమున శృంగారహాస్య వీరరసములును, పరశురామ ప్రవేశమున భయానకమును, అంబప్రతిజ్ఞ, అగ్నిప్రవేశములయందు భీభత్సరసమును, విచిత్రవీర్యమరణానంతరము శోకరసమును నాద్యంతము చదువరులను వివిధ భావములందుముంచి యెత్తుచుండును. [illegible] యుక్తమై—సముల్లాస పారవశ్యము కలిగించును, భీష్ముడు భానుమతిని దీవింపదలచి పిలువనంపినపుడు శ్రీకృష్ణుడు భానుమతికి మారుగా ద్రౌపది నాశీర్వదింపజేసి నమత్కృతికి హర్షప్రఫుల్లాంతరంగులను జేయును. భీష్మార్జునుల సంగ్రామము భయదాయకమై—భీష్మపతనముతో నాటకమునకు భీష్మవాక్యము చెప్పబడును. చక్కని పాటలు—రసవంతములగు పద్యములుగల్గి—ఆంధ్రదేశమునందలి ప్రతిపట్టణమునందును ప్రదర్శింపబడి పేరుగాంచియున్నది—పత్రికాధిపతులు చక్కని యభిప్రాయముల నొసంగి యున్నారు. నేటికీ నాటకము వెలువడియున్నది. వెంటనే కార్డువ్రాసిన లభించును. 8 చిత్రపటములతో శోభిల్లుచున్నది. అద్భుతమైన ముద్రణము. సర్వాంగ సుందరమై ఆర్టుపేపరులో ముద్రింపబడిన ప్రథమాంధ్రనాటకము.

వెల రు 1—0—0

కురుకూరి సుబ్బారావు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ కృష్ణాజిల్లా.

